శ్రీ రామాయనమః

# కిష్కింధా కాండము

వచనా - శరణం



"శతాభిషేకి"

కల్యాపూడి వేంకట వీరరాఘవాచార్యులు

శ్రీశ్రీశ్రీ తిరువేంగళముడైయాన్ కరుణావలన

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయంతో

శ్రీమద్రామాయణము

ద్వయ మంత్రార్థ వివరణము - చరణౌ - శరణం

భావ వివరణము - సంగ్రహతత్వము

# కిష్కింధా కాండము

(భావార్థ సంగ్రహము)



"శతాభిషేకి"

కల్లూపూడి వేంకట వీరరాఘవాచార్యులు

(భాషాప్రవీణ)

శ్రీరామతీర్థం - విశాఖ జిల్లా

శ్రీశ్రీశ్రీ తిరువేంగళముద్ది యాని కరుణవలన

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# అర్పణము

సీ॥ శ్రీరామచంద్రమా! శ్రితపారిజాతమా!
సీతయు సౌమిత్రి వాతసుతుడు
భరత శత్రుఘ్నులు బ్రహ్మాది సురలును
కులగురుల్ సమకూడి కొలువు సేయ
మాన్యమాతామహు మాదిరి నాచేత
పలికించినావు నీపరమగాధ
అష్టోత్తరశతమ్ము, ఆచార్య కృపనాడు,
వ్రాయించుకున్నావు వరద! నేడు

గీ॥ సమ్మతినిఁజూపి చరణంబు - శరణ మనెడి
కాండలందున 'కబంధ కాండ" కృతిని
నాదు జన్మము తరియింప, నీదినీకె
అర్పణము సేతుఁగృపతోడ నందికొనుము

భగవద్భాగవత పాదరేణువు
**క. వేం. వీరరాఘవాచార్యుడు**
**చరణదాసి, సుభద్రలక్ష్మి**



ప్రథమ ముద్రణ : 1000 కాపీలు

ముద్రణ
శ్రీ కృష్ణా పవర్ ప్రెస్, ఫోన్ 5540
లింగధారిపేట, విజయనగరం 531 202.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమత్ పరమహంస, పరివ్రాజకాచార్య, శ్రీమదుభయవేదాంత ప్రవర్తకాచార్య

**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు**

## మంగళాశాసనము

శ్రీ రామాయణ రసజ్ఞులకు ఉత్తరాంధ్ర ప్రాంతము ఆయువుపట్టుకాబోలు. ప్రతి యింట శ్రీరామాయణ పారాయణలు ప్రతి నిత్యం సాగుతుంటాయి శ్రీరాముని ఆదర్శంగా తీసికొనడం వల్ల కావచ్చు సదాచార సంపత్తి అత్యధికుల్లో దర్శనమిస్తుంది. వినయ విధేయతలు ఉట్టిపడుతుంటాయి. మృదుపూర్వ భాషిత్వం వారి సొత్తనిపిస్తుంది.

శ్రీ ఉ॥వే॥ శ్రీమాన్ కల్వపూడి వేంకట వీరరాఘవాచార్య స్వామివారిని చూడగనే శ్రీ రామాయణ ప్రేమ తొణికిసలాడుచుండే వారి చిరునవ్వు "మీరు ఆకళింపు చేసుకోండి శ్రీరామ తత్త్వాన్ని" అన్నట్లుంటుంది. శతాధికంగా "శ్రీమద్రామాయణ పారాయణలు చేసికొన్న ధన్యజీవులు వారు మనసులోని ప్రేమ మాటలై వెలువడితే దాని సుందరరూప పంచాలనే ఆర్తితో అక్షరస్వరూపం కల్పించారు వీరు

శ్రీరామ చరితాన్ని ఏంటయ ఎన్నిసార్లు విన్నా అది నిత్య నూతనంగానే వాపిస్తుంది, ఎన్నిసార్లు చూసుకున్నా తృప్తితీరని తన ముఖంరాగ - అంత అతృప్తామృతముగ వాల్మీకి గిరిసంభూత యైన ఆ రామాయణ మహానదీ అంతస్సారాన్ని దోసిళ్ళతో త్రావి ఆ రుచిని అందరికీ పంచే విశాల హృదయంతో శ్రీమాన్ రాఘవా చార్య స్వామి ఆ "రామాయణ కిష్కింధాకాండ భావార్థాన్ని" చిన్న గ్రంథంగా రూపొందించి పదుం షా కె ం తో తృప్తిని కలిగించింది. మిగిలిన కాండల "భావార్థము" గూడ యిదేవిధముగ వీరి ద్వారా రాగలిగితే జిజ్ఞాసువులకు ఇది "కొండంత అండ" కాగలదు

సామాన్యంగా శ్రీరామయణంలోని భావాలకు ఏదోరూపంలో వ్యాఖ్యలు అందించేవారు సుందరకాండనుండి అందించే ఆనవాయితీ ఉంటుండగ, వీరు నూతన పోకడలలో ఒక క్రొత్త పద్ధతికి నాంది పలుకుతూ "కిష్కింధా కాండ" నుండి భావార్థాన్ని అందించడం ప్రారంభించారు, దాని కేదో కారణం ఉండి ఉంటుంది.

"సుందర కాండ" అచార్యవైభవ ప్రకాశక" మైతే ఆ ఆచార్యుడు లభించిన సమయం, సన్నివేశము ఎంతపవిత్రమైనవో మధురమైనవో గద ! ఆ ఆచార్యుని పొందిన కాలమును ముందు స్మరించడం బుద్ధిమంతుల లక్షణం శ్రీ గోదాదేవి ఈపోకడకు

నాందిపలుకుచూ "మార్గళిత్తింగళ్" అంటూ ఆచార్యాశ్రయవేళను కీర్తించింది. శ్రీమాన్ రాఘవాచార్యులుగారి మీద ఆ ప్రభావం బాగా ప్రసరించి ఉంటుంది, కనుక శ్రీ రామసీతలు కలియుటలో ఆచార్య స్థానము వహించిన హనుమ, శ్రీరామునికి లభించిన సన్నివేశములను వర్ణించిన కాండము కిష్కింధాకాండమని ఆక్కడ నుండి తమరచన ప్రారంభించినారు, పంపాతీరములో శ్రీరామునికి హనుమ సమాశ్రయణం లభించిన దృశ్యాన్ని చాల అందంగ వర్ణిస్తూ ఈ భావాన్ని వీరు వెలిబుచ్చారుకూడ తమ ఆచార్య కటాక్ష విశేషమువల్ల వీరిలో ప్రకాశించిన రహస్యార్థ పరంపర అంతా యిదే విధముగ క్రమముగ అ క్ష ర రూ పం దాలుస్తూ "ఆర్తజన జీవాతువు"గ అందవలెనని అట్లు అందించే శక్తి, సమయం అవకాశం శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారికి ఆ సపరివార శ్రీరామచంద్ర ప్రభువు "కృపచేయుగాక" అని అనేక మంగళాశాసనములు చేయుచున్నాము.

కేంప్ జెంషెడ్‌పూర్

తే 18-11-92

**సం॥ చిన్న శ్రీ రా. జీయర్.**

P. T. G. V రంగాచార్యులు
MA (Tel) MA (Skt)
B O L S S
G. J College, పాలకొండ

సుధర్మా
14-7-91
(కేంద్రీయ సచివ కార్యదర్శి)
(విశ్వ సంస్కృత ప్రతిష్ఠాన వారణాశి)

# శుభాకాంక్ష

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనం॥

నూరుకోట్ల సంఖ్యతో విరాజిల్లిన శ్రీరామచంద్రుని వృత్తాంతములో ప్రత్యక్షరముగూడ మహాపాతకములను సైతము నశింపజేయగలదుగదా! అట్టిది శ్రీమద్రామాయణాంతర్గత "శరణం" అను దాని వివరణమైన కిష్కింధా కాండముయొక్క పఠనము ఇంకెంత పుణ్య సముపార్జన చేయించగలదో తెలియలేము అందునా "కిష్కింధాకాండ" మూల పఠనమేగాక అందు నిబిడీకృతమైయున్న విశేషార్థ రచన గావించి "మావంటి తెలియనివారికి చాలమందికి తెలియని ధర్మరహస్యము లనెన్నింటినో "భావార్థ సంగ్రహము"ను పేర ప్రకటించుటచే కృతకృత్యులైన "శ్రీమాన్ కల్వపూడి వేంకట వీరరాఘవాచార్యులుగారు" ధన్యజీవులైరి సృష్టి, స్థితి లయకారకుడై, సకల జగదధిష్ఠాన చైతన్య స్వరూపియైన శ్రీమన్నారాయణుని శ్రీరామావతారములోని విశేషములను తెలిపిన భావార్థ సంగ్రహములో వారి విమర్శనాజ్ఞానము

పరిహరించుటయే గాక భాగవతోత్తములు వారిని ఆశీర్వదించి యొసగిన "శతాభిషేక" నామము సార్థకమై వారు తరించి పతితులను తరింపచేసిరి.

ఈ గ్రంధమును ఆమూలాగ్రమును పఠించితిని. తనివి తీరక మరల పఠించితిని. "సౌమిత్రే! పశ్యపంపాయాః కాననం శుభదర్శనం" అను శ్లోకమునకు సామాన్యార్థము" పంపా సమీపారణ్యవృక్షములు పొడవైన కొమ్మలతో నుండి శిఖరములుగల పర్వతములవలె ప్రకాశించుచున్నవి. అని మాత్రమే గాని రచయిత ఆచార్య శిష్యసంబంధమునకు ప్రతీకగా ఆశ్లోకార్థమును వివరించిరి మరియు "పశ్యరూపాణి సౌమిత్రే! . "అను శ్లోకములో ఆచార్యపురుషులు తమ శిష్యులకు ఎంత వాత్సల్యముతో ఉపదేశింతురో విశదపరచిరి ఆంజనేయుడు భిక్షురూపమున రామలక్ష్మణులతో సంభాషించిన తీరులోగల "సువర్ణాభా "శ్రీమంతౌ పద్మపత్రేక్షణౌ రాజర్షి " దేవప్రతిమౌ" యదృచ్ఛయేవగాం ప్రాప్తౌ" అన్న విశేషణములతో "భ,గ,వ" చ్ఛబ్ద వాచ్యుడైన శ్రీమన్నారాయణుని మనకు దర్శింపచేస్తారు రచయిత

"నానృగ్వేద వినీతస్య . అను శ్లోకమున వేదత్రియములోని విశేషార్థములను వివరించుచు ఆంజనేయుని మాటలు విన్న శ్రీరాముడే అతనిని ఆచార్య స్థానీయునిగా నిర్ణయించెననుటచే, ఆచార్యుడెట్లుండవలయునో తెలియుటయే గాక "ఆంజనేయుడికాండమునందే ఆచార్యుడుగా గుర్తింపబడుటయు, జరిగినది. అంతేగాక భగవంతుని సేవించుటకు ముందుగా భాగవతోత్తములైన భగవద్భక్తులను సేవించి

భాగవత పురస్సరముగా భగవంతుని సేవింపవలెననెడి విశిష్టాద్వైత సిద్ధాంతమును "లక్ష్మణునిచే సుగ్రీవునకు "గజపుష్పలత" వేయించుటలో" కనబడుచున్నదని చెప్పుట" రచయిత యొక్క ప్రపన్నత స్పష్టమగుచున్నది

శ్రీరామావతార రహస్యమెఱిగిన తారపలుకులలో "నివాస వృక్షస్సాధూనాం,ఆపన్నానాం పరాగతిః" ఆర్తానాం సంశ్రియశ్చైవ యశసశ్చైక భాజనం" అను విశేషణములకు రచయిత చూపిన విశేషార్థములు పరితల మనోవికాసానికి ఆకరములగుననుటలో అతిశయోక్తి కానరాదు.

ఈ విధముగ రచయిత ఎన్నో విశేషార్థములను మనకు తెలియపరచి తాము తరించి పఠితలను తరింపచేశారు లోకమున మానవజన్మమే దుర్లభము జన్మించినను విద్యావంతుల గుట కష్టము. విద్యయున్నను కవిత్వరూపముగా దానిని భగవద్వినియోగము చేయుట, భగవద్గుణానుభవము కలిగియుండుటయు పూర్వ జన్మసుకృత విశేషమే.

ఆ సుకృతాన్ని పొందిన శ్రీమాన్ వీర రాఘవాచార్యులు గారు ధర్మస్వరూపుడైన శ్రీరామ చంద్రుని శరణాగతిని ప్రాచించు కిష్కింధా కాండలో "భావార్థములను" సంగ్రహించి కృతకృత్యులైనారు. ఈ కావ్యము ఆ చంద్రార్కం సత్కీర్తినార్జించాలని "శుభాకాంక్ష" లందించడం మన కనీస ధర్మం.

ఇట్లు సహృదయ విధేయుడు

ఇతిశం — పా॥ తి॥ గు॥ వేం॥ రంగాచార్యులు

కల్వపూడి శరణ్యాచార్యులు
భాషాప్రవీణ

శ్రీరామతీర్థం
12-10-88

# శుభాశీస్సులు

అస్మద్గురుభ్యోనమః

లోకహితమునకు పరివర్తించిన మహాకావ్యము శ్రీమద్రామాయణము దానిని పలువిధములుగా లోకమునకు అందచేయుటకు ఎందరో మహానుభావులు కృషిచేసియున్నారు. చేయుచున్నారుకూడ ఇందు ప్రతికాండమునందు రసవత్తరమైన ఘట్టములుగలవు అందు ముఖ్యమైనది "సుందరకాండము" అది ఆచార్య కృత్యమును ధ్వనింపచేయునట్టి పవిత్రమైన భాగము. దానికి ముందున్న కిష్కింధ కాండమున ఆచార్య లక్షణములు ధ్వనించును. పరమాత్మ చేతనోద్ధరణకై సన్నద్ధుడైన ఆచార్యుని గురించిపంపుట ఈ కాండమున ధ్వనించును.

అట్టి కిష్కింధా కాండమునందలి కథాభాగమును సంగ్రహముగ తెలియచేయుచు ఆయా శ్లోకములందు ధ్వనించు విషయములను వ్యాఖ్యానము ననుసరించి ఒక చిన్న గ్రంథమును గూర్చి చిరంజీవి నాసోదరుడు వీరరాఘవాచార్యులు చిన్నతనమునుండియు శ్రీమద్రామాయణము నందు మిక్కిలి ప్రీతియు, భక్తియు కలిగి ఆచార్య ముఖమునుగ దానిని ఉపదేశమంది నూటఎనిమిది పర్యాయములు పారాయణ చేసి సామ్రాజ్య పట్టాభిషేకముచేసి భాగవత కటాక్షమునకు పాత్రుడైనాడు.

మా మాతామహులు శ్రీ ఉ॥ వే॥ శ్రీమాన్ శ్రీభాష్యం వీరరాఘవాచార్యులయ్యవార్లంగారి పేరు తనకు పెట్టినందులకు తగినట్లుగ వారికి మిక్కిలి ప్రీతి కలిగించు శ్రీమద్రామాయణమును తాను నిత్యానుసంధానముగ చేసికొన్నాడు. అస్మదాచార్యులైన శ్రీ ఉ వే. శ్రీమాన్ శ్రీ పుత్తూరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యులయ్యవార్లంగారి కృపకు పాత్రుడై రహస్యార్థముల నుపదేశమందినాడు మా పితృపాదులైన శ్రీ ఉ.వే శ్రీమాన్ కల్యాపూడి రంగాచార్యులవారి ఆశ్రయము నెరవేర్చినాడు.

ఈతడు ఇట్టి కృషి చేయుటకు కారణము ఆ శ్రీరామచంద్రుని నిర్హేతుక జాయమాన కటాక్షము, భాగవత కృప, ఆచార్యాను గ్రహము మాత్రమే ఈ నాసోదరుడు ఇంకను పెద్దలవలన పొందదగిన, పొందవలసిన ఉపదేశములను పొంది ఇతోధికమైన కృషి చేసి ధన్యుడగునట్లు ఆ రామచంద్రుడు కటాక్షించుగాక "అని ఆశీర్వదించుచున్నాను.

భాగవత విధేయుడు

కల్యాపూడి శరణ్యాచార్యులు



శ్రీభాష్యం అప్పలాచార్యులు — విశాఖపట్నం

11-10-88

శ్రీమద్రామాయణము వేద సమ్మితము వేదోపబృంహణము ఇది పవిత్రము, పాపఘ్నము, పుణ్యము సకల ధర్మ సముచ్చయము సకలోపనిషత్ సారార్థ నిరూపకము. నిత్యము జపింపదగిన మంత్రము. శ్రీమద్రామాయణము సౌందర్య పవిత్రితా, సమన్వితము కావ్యోపనిషత్ సమాహారము దీనిని అధికరించనివారు మానవ జన్మనెత్తిన ఫలము నొందని వ్యర్థజీవులు.

పురాకృత సుకృత ఫలముగా మా బావగారు శ్రీమాన్ కల్యాపూడి వేంకట వీరరాఘవాచార్యులుగారు శ్రీమద్రామాయణైక జీవులు వీరికి మిత్రులు శ్రీ కోడుగంటి కృష్ణమూర్తిగారు హనుమదుపాసనైక జీవులు వీరిరువురి భావనాతపః ఫలమే యీ కిష్కింధా కాండ భావార్థ సంగ్రహము బాహ్యమున కావ్యసౌందర్యమును, అంతర్యమున ఆధ్యాత్మిక తత్వమును ఎట్లు అనుభవింపవలెనో చూపినారు. పఠితలు సహృదయులై పఠించి తరింతురుగాక

శ్రీభాష్యం అప్పలాచార్యులు

11-10-88



మారేమండ అనంతరామారావు | నర్సీపట్నం
MABL న్యాయవాది | 20-10-88

## అభిలాష

శ్రీమాన్ కల్వపూడి వేంకట వీర రాఘవాచార్యులు గారితో మొదట పరిచితము పరిమితమైనను వారి శ్రీరామాయణ పారాయణము అందలి గూఢార్థ, ఔచిత్యము లను వినిన తరువాత అతిగౌరవనీయులుగా వారు నాకు అత్యంతాత్మీయులైనారు మృదువచనములతో మధుర కంఠముతో విశేషార్థములతోడి వారి రామాయణోపన్యాసములు విని ధన్యుడనైతిని శ్రీమాన్ ఆచార్యులవారు కిష్కింధాకాండములోని క్లిష్టమైన రహస్యార్థములను వివరించుట వారి విశేష ప్రజ్ఞకు దృష్టాంతము అందలి భావార్థములను, ధర్మ, న్యాయ, శిష్టాచార, రాజకీయాదులను స్పష్టముగా విశదీకరించిన విషయములు వారి సంస్కృత భాషాధ్యయన కృషికి యీ "భావార్థ సంగ్రహము" గీటురాయి శ్రీరామాంజనేయులకు "పుష్పమాల" అనుట అతిశయోక్తి కానేరదు "రవి గాననిది కవి గాంచును" అనుట వారి విషయమున సార్థకమైనది శ్రీ సీతారామాంజనేయులు శ్రీమాన్ రాఘవాచార్యులు వారికి సర్వదా, సర్వథా జయమును, ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక" అని "అభిలషించు" వారి శ్రేయోభిలాషి

మారేమండ అనంతరామారావు
న్యాయవాది, MABL నర్సీపట్నం

ఓం శ్రీరామాయ నమః

ధవళ సుబ్బారావు                                        విజయనగరం

## ఆకాంక్ష

శ్రీమాన్ కె. వేం. వీరరాఘవాచార్య స్వామి వారికి నమస్కారములు మీరు రచించిన కిష్కింధాకాండ భావార్థ సంగ్రహము చదివితిని సామాన్యునికి సామాన్యంగా వివేక వంతునకు విశేషజ్ఞానం ప్రసాదించేదిగా ఈవ్యాఖ్య ఒప్పుచున్నది దీనికి మీరు "సంగ్రహం" అని నామకరణం చేసినా "కొండ అద్దమె యుండదా" అన్నట్లు విశ్వరూపము వలె బహుముఖ విషయజ్ఞానాన్ని యీ వివరణ ప్రసాదిస్తుంది యీ కోశం మావంటి పారకులకు ఎంతయో ఉపయోగం కాగలదని నా అభిప్రాయం. ఈ గ్రంథము త్వరలో ముద్రిణ అయి వెలుగులోనికివచ్చి ఎల్లరు శ్రీరామ చరణ పంకజ సౌరభాన్ని ఆఘ్రాణించి తరించాలని ఆకాంక్ష. రచన చక్కగా సాగింది. శ్రీరామ ప్రేరణవలన మారుతి మీచే వ్రాయించినాడని నా భావన

బుధజన విధేయుడు
ధవళ సుబ్బారావు, M A M Ed
M H School, Kaspa,
Vizianagaram





# వినయాంజలి

శ్లో॥ "శ్రీశైలశైల మునిపాద సరోజభృంగ
సంపత్కుమారసుత వేంకట లబ్ధబోధం
శ్రీరామతీర్థ వరశాఖ్య పరంగసూనుం
శాంతం శరణ్య గురుశేఖర మాశ్రయామి॥

శ్లో॥ రామాయణ రహస్యజ్ఞం రమ్యవాక్య విశారదం
అస్మత్పరమగుర్వార్యం అప్పలాచార్య మాశ్రయే॥

వేదవేద్యుడైన పరమాత్మ శ్రీరాముడై అవతరింపగా వేదమే శ్రీమద్రామాయణముగా వాల్మీకి ముఖము నుండి ఆవిర్భవించెను. వేదము పూర్వభాగమునందు కర్మాచరణమును దెలుపుచు ఉత్తర భాగమునందు ప్రాప్యుడైన సర్వేశ్వరుని నిరూపించుచున్నది శ్రీమద్రామాయణము బాహ్యముగ ఒక ధర్మస్వరూపుని కథవలె కనిపించును. అంతర్యముగ భగవంతుని నిరూపించుచు ఉపనిషత్ సిద్ధాంతమైన ద్వయ మంత్రముయొక్క అర్థమును విశదీకరించుచు దీర్ఘ శరణాగతి గ్రంథముగా ఇతిహాసశ్రేష్ఠమై మిక్కిలి పవిత్రము పాపఘ్నము పుణ్యమునై వెలయుచున్నది.

ఈ ఇతిహాస శ్రేష్ఠమును, అనేకమంది కవులు, భక్తులు, పండితులు ఎన్నో భాషలలో గద్య పద్యాది రూపములలో వెలయఁజేసిరి. అట్టి దానిని నావంటి అల్పజ్ఞుడు, శాస్త్రజ్ఞాన జాత్యంధుడు మరల వ్రాయఁబూనుట హాస్యాస్పదము అయినను అట్లు వ్రాయుటకు కారణము విన్నపము చేయుచున్నాను.

భక్తజన సంరక్షకుడైన శ్రీ వేంకటేశ్వరుడు షట్ భుజములతో తురగారూఢుడై గరుడాద్రియందు స్వయంవ్యక్తుడై వెంచేసియున్న "ఉపమాకా" అను ప్రసిద్ధిగాంచిన దివ్యక్షేత్రమునందు సుమారు అయిదారు సంవత్సరములనుండి శ్రీవారి వైదిక కైంకర్యంచేసుకొనెడు భాగ్యము దాసునికి కలిగినది ఆసందర్భమున అచటి శ్రీ శ్రీనివాస భక్త సమాజ కార్యదర్శియు, శ్రీహనుమదుపాసకులు అయిన శ్రీమాన్ G V రమణాచార్యులుగారు శ్రీమద్రామాయణము పురాణ కాలక్షేపము చేయవలసినదిగా కోరిరి వారి ఆజ్ఞప్రకారము అప్పుడప్పుడు శ్రీమద్రామాయణ ప్రవచనము జరుగుచుండగా వారి మిత్రులను శ్రీహనుమచ్ఛక్తి ప్రచార సభాసభ్యులును అగు శ్రీ కోడుగంటి కృష్ణమూర్తిగారికి నన్ను పరిచయము చేసిరి వారు నన్నెంతో గౌరవించి తాము వ్రాసిన "కిష్కింధా కాండ సంగ్రహము" నాకుఁజూపిరి. అది సంగ్రహమైనను సామాన్యులెల్లరకును సులువుగ చదువుకొనుటకుచాలబాగున్నది ఇంకను ఆకాండ యందలి విశేషార్థములను దీనిలో వ్రాసిన యెడల మిగుల శోభించునని మాటల సందర్భములో అనగా వారు ఆవిశేషార్థములు క్లుప్తముగా మీరే వ్రాయవలసినదని

నన్ను కోరిరి కాని అల్పజ్ఞానినగు నా వంటి వానికి ఆపని అసాధ్యమని చెప్పితిని

అయినను వారును, వారి సభాసభ్యులును, శ్రీమాన్ G V రమణాచార్యులుగారును కూడ మరల ప్రేరేపించుచు ఆ శ్రీరామాంజనేయులే మీ చేత వ్రాయింపగలరు గాన వెంటనే ప్రారంభింపుడు "అని నాలుగైదు లేఖలు వ్రాసిరి. వారి ప్రోత్సాహముతో "ఇదియును రామకటాక్షమే, ఇన్ని మాటలు పలికించినవాడు వ్రాయించకపోవునా! అను ధైర్యముతో ప్రారంభింపవలచి వెంటనే మా ఆచార్యులు (గురుదేవులు) అయిన శ్రీ ఉ వే ప శ్రీమాన్ కల్వపూడి శరణ్యాచార్యస్వామి వారిని, మా పరమాచార్యులు, రామాయణ రహస్యజ్ఞులు అయిన శ్రీ ఉ వే ప్ర శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు వారిని ప్రార్థించి వారి సలహా కోరినితి వారును నాయందలి వాత్సల్యముతో నాకు తగు సలహాలనొసంగి ఆశీర్వదించి వ్రాయుటకు ఆజ్ఞనొసంగిరి వారి ఆశీస్సులు శ్రీరామచంద్రుని కటాక్షము, వ్రాయింపగలరను ధైర్యముతో ఇందులకు పూనుకొంటిని గ్రంధ విస్తరభీతిచే కథాభాగముతోబాటు విశేషార్థములు కూడ చాల సంగ్రహముగ "భావార్థ సంగ్రహము" అను పేరుతో వ్రాసితిని క్షంతవ్యుడను.

ఈ కాండమునందు "నారాయణుడగు పరమాత్మ యొక్క స్వామిత్వ, సౌలభ్య, సౌశీల్య వాత్సల్యాది గుణములు ప్రస్ఫుటములగును. అంతేగాక ద్వయమంత్రమ నందలి

"శరణం" అను పదముయొక్క అర్థమును సూచనాప్రాయముగా తెలియ చేయబడుచున్నది ఆచార్య లక్షణములు స్పష్టముగా తెలియ చేయబడినవి. అందుచే శ్రీమన్నారాయణుడగు శ్రీరామచంద్రుని చరణములను "శరణు" కోరుచు ఈ "భావార్థ సంగ్రహమును వ్రాయబూనితిని

ఇందేమైన దోషములున్న అవి యన్నియు దాసునివి గుణములేవి యున్నను అవి మా ఆచార్య పరమాచార్యుల వియే అని విన్నవించుచున్నాను ఈ గ్రంథము వ్రాయుటకు ఆధారములు గోవింద రాజీయవ్యాఖ్యానము, మా ఆచార్యుల వివరణము, మా పరమాచార్యుల ఉపన్యాస సూక్తులు అని "వినయాంజలి" ఘటించి విన్నవించుకొనుచున్నాను.

దీని ముద్రణా విషయమై తగు సలహాలనొసంగి దారి చూపిన మా బావగారు శ్రీ ఉ. వే శ్రీమాన్ శ్రీభాష్యం గోవిందాచార్యస్వామి (సంస్కృతాధ్యాపకులు, ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాల V Z M) వారికి నా కృతజ్ఞత

ముద్రణా విషయములో కోరినంతనే అంగీకరించి తమ స్వంత గ్రంథముగా, గ్రంథ గౌరవముతో ముద్రింపించిన శ్రీ ఎ. సోమేశ్వరరావుగారు కృష్ణా పవర్ ప్రెస్, విజయనగరం వారికి నా హార్దికాభివందనలు.

భగవద్భాగవత విధేయుడు
క. వేం. వీర రాఘవాచార్యులు

ఓం శ్రీ రామాయ నమః

# శ్రీ మద్రామాయణము
# ద్వయ మంత్రార్థ వివరణము
# చరణౌ-శరణం, కిష్కింధాకాండము
# భావ వివరణము సంగ్రహ తత్త్వము

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయో భూయోనమామ్యహం॥

శ్లో॥ శంపామధ్యస్ఫురన్నీలతోయదద్యుతి విగ్రహం
సీతయాఽఽలింగితం రామం కలయేఽభీష్టసిద్ధయే॥

శ్లో॥ అసాధ్యసాధక ! స్వామిన్ ! అసాధ్యం తవకింవద !
రామదూత! కృపాసింధో! మత్కార్యం సాధయ ప్రభో!

శ్రీమన్నారాయణుడు శిష్టరక్షణ, దుష్టశిక్షణ, ధర్మ సంస్థాపన చేయుటకై అనేకావతారములను దాల్చుచు రావణ వధకై కౌసల్యా దశరథులకు శ్రీరాముడుగా అవతరించి తాటకా సుబాహుల వధతో దుష్టశిక్షణ ప్రారంభించి, మారీచుని దక్షిణ సముద్రము వరకు తూలగొట్టి, శివధనుర్భంగ మొనరించి సీతను వివాహమాడి అయోధ్యలో పండ్రెండు సంవత్సరములు సుఖముగా జీవనము గడిపెను. "బాలకాండేన శ్రీమచ్ఛబ్దార్థ ఉక్తః" అను గోవిందరాజీయ వ్యాఖ్యానము చే బాలకాండచేత ద్వయమంత్రమందలి శ్రీమచ్ఛబ్దార్థము చెప్ప బడెను దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకము చేయ నిశ్చ యింపగా కైక దశరథుడు కోరిన వరముల ప్రకారము తండ్రి ఆజ్ఞ అను మిషతో, భార్యయగు సీతాదేవితోడను, సోదరుడగు లక్ష్మణునితోడను పదునాల్గు సంవత్సరములు అరణ్యవాసము

చేయుటకై అడవికి బయలుదేరెను శ్రీరాముడు. చిత్రకూట పర్వతముపై నుండగా భరతుడేతెంచి శ్రీరాముని అయోధ్యకు వచ్చి పట్టాభిషేకము చేసికొమ్మని ప్రార్థించెను. కాని రాముడు రాజ్యమును తృణప్రాయముగా వదలి సత్యవాక్పాలనకై అరణ్యవాసమున కేగెను అయోధ్యకు మరలి రమ్మని ప్రార్థించిన భరతునకు పాదుకల నొసంగి మహర్షులను కాపాడుదునని ప్రతిజ్ఞ యొనర్చి దండకారణ్యమునకు ప్రయాణమయ్యెను "అయోధ్యాకాండేన నారాయణ శబ్దార్థః" కళ్యాణ గుణానా ముపవర్ణనాత్" అని నారాయణ శబ్దార్థము కళ్యాణ గుణములనే వివరింపబడెను.

త్రోవలో విరాధుని వధించెను. శరభంగుని దర్శించెను అగస్త్యాది మహర్షుల ఆశ్రమములను దర్శించుచు పది సంవత్సరములు గడిపి దండకారణ్యమునకు చేరి పంచవటి అను ప్రదేశమున ఆశ్రమమును నిర్మించుకొని జటాయువుతో స్నేహమొనర్చుకొని నివసించు చుండెను. అచట రావణుని సోదరి శూర్పనఖ రాముని జూచి కామింపగా లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులు కోసి పంపెను. పగబట్టిన శూర్పనఖ రావణునితో ఖరాదుల వధ చెప్పి సీతాసౌందర్యమును వర్ణించి ఆమె నపహరించి రామునకు ప్రతీకార మొనర్పుమనెను మూర్ఖుడగు రావణుడు మారీచుని మాయామృగముగా బంపి సీతనాకర్షింపజేసి రామలక్ష్మణులు ఆ మృగమునకై వెడలగా సీత నపహరించి అడ్డుపడిన జటాయువు రెక్కల నరికి పడవైచి కామగమన రథముపై సీతను లంకానగరమునకు తీసికొని పోయి అశోకవనమున నుంచెను తిరిగివచ్చిన రామలక్ష్మణులు పర్ణశాలలో సీత లేకుండుటచే ఆమెకొరకై వెదకుచు జటాయువు

నకు మోక్షమొసఁగి కబంధుని వధించి స్వస్వరూపమునొందిన అతనివలన సుగ్రీవుని గూర్చి తెలిసికొని, శబరి ఆతిథ్యమును స్వీకరించి ఆమెమూలప్రకారము పంపాతీరమునకు సోదరునితో చేరెను. "దివ్యమంగళ విగ్రహ వర్ణనాచ్చరణ శబ్దార్థః" దివ్య మంగళ విగ్రహవర్ణననే "చరణ" శబ్దార్థము తెలియ జేయ బడెను. ఇంతవరకు బాలాయోధ్యారణ్యాకాండములు. పంపా సమీపారణ్య వర్ణనతో కిష్కింధా కాండము ప్రారంభము కిష్కింద, సుందరకాండలలో "శరణ" శబ్దార్థము యుద్ధకాండ మున "ప్రపద్యే" శబ్దార్థము వివరింపబడెను అయినను రామాయణము ద్వయమంత్ర వివరణగాగ అన్ని కాండలలో అన్నిపదములు వివరింపబడెను.

## భావవివరణము-సంగ్రహ తత్వము

శ్రీరాముడు పరమాత్మ. సీతయే చేతనుడు (జీవాత్మ) ఈ జీవుడు ఎల్లప్పుడు భగవంతుని ఆరాధించుచు ఆ స్వామిని అనుభవించు చుండవలెను అట్లు గాక ఇతర విషయములందు ఆసక్తిచూపిన యెడల భగవానునికి దూరమగును.

సీత (జీవుడు) తన దగ్గరనున్న రాముని (పరమాత్మ) కంటె ఆ మారీచ మృగము (మరీచిక = ఎండమావి — లేనిది ఉన్నట్లు కనబడునది) పై ఆసక్తిచూపెను. అందుచే రామునకు (పరమాత్మ) దూరమై రావణుని (రావణుడు కోరికలు తీర వలెనని గోలచేయు మనస్సుచే కొనిపోబడి లంక (శరీరంములో నుండవలసి వచ్చెను అందు రాక్షస స్త్రీల హింసల (తాప త్రయాదులు) కు గురియై తన దోషము నెఱిగి భగవంతుని యందే మనసు నిలిపి ప్రార్థించుచుండెను. ఆ జీవుడు పడుచున్న దుఃఖమును చూచిన భగవానుడు అతనిని ఎట్లు ఉజ్జీవింపచేయ

వలయునో (ఉజ్జీవన = దూఃఖమును బోగొట్టి తన వద్దకు చేర్చు కొనుట) ఆ వ్యాఖ్యాయి పేఁకుటయే శ్రీరాముడు సీతను వెదకుట

పరమాత్మ ఆచార్యుని (గురుని) ద్వారానే జీవుని (చేతనుని) రక్షించును. చేతనుడు (జీవుడు) ఆచార్యుని (గురువు) ద్వారానే పరమాత్మను చేరవలెను ఆచార్యుడు వేదాధ్యయనాదులు చేసి శాస్త్రముల నభ్యసించి పురాణ పఠనాదులచే భగవదాభిముఖ్యము కలిగిన శిష్యులను పరమాత్మ వద్దకు చేర్చగల సామర్థ్యము గలవాడై యుండవలెను అట్టి ఆచార్యుని (గురువు) కొరకై రాముడు (పరమాత్మ) వెదకు చుండగా ఆ లక్షణములుగల ఆంజనేయుడు అను ఆచార్యుడు (గురువు) లభించుటతో "కిష్కింధా కాండము" భగవదాచార్య లక్షణములను కనిపింపజేయుచు ప్రారంభమగును

ఈ కాండమునందు జీవుని ఉజ్జీవింప చేయుటకై తగిన ఆచార్యుని వరించుట ఆచార్యుని ద్వారా భగవద్వైభవము తెలియబడుట, శరణాగత రక్షణము, సర్వేశ్వరత్వ ప్రకటనము శాస్త్ర, శిష్ట, లౌకికాచారములు ఆచార్యుని ద్వారా అభయ ప్రదానము (అనగా కరవిభూషణమగు అంగుళీయకమును పంపుట) ప్రధాన విషయములు అందువలననే జీవులు ప్రసన్నులై (నీవు తప్ప మరి రక్షకులు లేరు అనుట) జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులు ఆరు 3 × 2 = 6 భ, గ, వ, ఒక్కొక్క అక్షరముచే రెండేసి గుణములు తెలియచేయ బడును భ, గ, వ, చ్ఛబ్దవాచ్యుడైన పరమాత్మ స్వరూపము నెఱింగి, "భగవానునే శరణు కోరవలెను" అనుటయే ముఖ్యముగా ద్వయమంత్రము నందలి "నారాయణ, చరణౌ

శరణం అను పదముల అర్థము ఈ కాండమునందు సూచింప బడినది అని పెద్దలు చెప్పుదురు. ఆంజనేయుడు, లక్ష్మణుడు తార పలికిన పలుకులలో నారాయణత్వము స్పష్టమగును

కిష్కింధా కాండము – 1వ సర్గ – 1వ శ్లోకము

**శ్లో॥ సతాంపుష్కరిణీంగత్వా పద్మోత్పలఝషాకులాం**
**రామస్సౌమిత్రిసహితోవిలలాపాకులేంద్రియః॥**

శ్రీరాముడు సౌమిత్రితో కూడ తామరలు, కలువలు, చేపలు మొదలగు వానితో ఆ కులముగా నున్న ఆ పంపా సరస్సును చేరి ఇంద్రియములు వ్యాకులత చెందగా విచారించు చుండెను.

భావ వివరణము – సంగ్రహతత్వము

మొదటి సర్గయందు రాముడు పంపా సరస్సును, ఆతీర మందలి వనమును వర్ణించుటయు, సీత కొరకై విరహము చెందుటయు బాహ్యము అంతర్యముగా అయ్యో! ఎల్లప్పుడు భగవంతుని సేవించుచు నిత్యసూరుల దర్శనముతో వారి అనుభవమును తాము కూడ పొందవలసిన జీవులు బాహ్యము లైన వస్తువులచే ఆకర్షింపఁబడి భగవంతుని పొందలేకున్నారే, అను విచారాతిశయము సూచింపఁబడినది. ఈ వర్ణనలో జల, పుష్ప, వృక్ష, శాఖా, పర్వతశిఖర, మేఘాదులు వర్ణింపఁ బడినవి. కాని తద్గుణ సామ్యములచే పరమాత్మ, తద్భక్తులు ఆచార్యులు, శిష్యులు, భగవానుడు, జీవులు, సారూప్యము చెందుట మొదలగునవి ధ్వని రూపముగా సూచింపఁబడినవి

**శ్లో॥ సౌమిత్రే! శోభతేపంపా వైడూర్యవిమలోదకా**
**ఫుల్లపద్మోత్పలవతీ శోభితా వివిధైర్ద్రుమైః॥**

సౌమిత్రీ! ఈ పంపా సరస్సు వైడూర్యమువలె నిర్మలమైన నీరు కలిగియున్నది. వికసించిన తామరలు కలువలు కలిగి తీరమున నానావృక్షములతో ప్రకాశించుచున్నది.

భావ వివరణము – సంగ్రహ తాత్పర్యము

ఇందు "నీరు" అనగా భక్తిరసము ఆ భక్తి వైడూర్యము వలె స్వచ్ఛముగా నుండుట, అనగా నిర్మలమైన అనన్యభక్తి (కేవల నారాయణుడగు పరమాత్మకే భక్తుడై యుండుట) అని భావము వికసించిన తామరలు, కలువలు అనగా ఆభగవద్భక్తి అనెడు రసముచే భగవద్దర్శనము చేసికొని శరణాగతి చేయుటకై విప్పారిన ముఖములు కలిగియుండుట (నీటిచే వికసించిన తామరలచే, కలువలచే సూచితము) నిర్మలమైన అనన్యభక్తితో చేతనులు భగవానుని శరణాగతి చేయుటకు విప్పారిన ముఖములలో నున్నారనెడు "ధ్వని" సూచితము. ద్వయమంత్రమందలి "శరణం" (భగవానుడే రక్షించువాడు ఇతరులు కారు) అను పదముయొక్క అర్థము సూచనగా ప్రారంభింపబడినది

**శ్లో॥ సౌమిత్రే! పశ్యపంపాయాః కాననం శుభదర్శనం**
**యత్రరాజంతి శైలాభాః ద్రుమాస్సశిఖరా ఇవ॥**

లక్ష్మణా! ఈ పంపా సమీపారణ్యమందలి వృక్షములు పొడవైన కొమ్మలు కలిగియుండుటచే శిఖరములతో గూడిన పర్వతములవలె ప్రకాశించుచున్నవి

భావ వివరణము - సంగ్రహ తత్త్వము

ఇందు భగవద్దయారసోపజీవులైన ఆచార్యులును వారి నాశ్రయించుకొని యున్న శిష్యులును సూచింపబడిరి పంపా సరస్సే భగవానుడు "హరిసరసివిగాహ్యాపీయ తేజోజలౌఘం" అను ఆచార్యోక్తిచే భగవానుడను సరస్సులో మునిగి ఆ తేజస్సు అనెడు జలము ద్రావుట అనగా ఆ సరోజలముచే వృద్ధిపొందింపబడిన వృక్షములు, భగవద్దయారసముచే జీవించు ఆచార్యులు, ఆ వృక్షముల నాధారము చేసికొనినవి కొమ్మలు అనగా ఆచార్యులపై ఆధారపడిన శిష్యులును సూచింపబడిరి. అంతయెత్తుగా పెరుగుట, భగవద్దయారసము వలన, అని భావము. శిఖరములతో గూడిన పర్వతములవలె ననుట ఎట్టి గాలికి చలింపకుండుట పర్వత లక్షణముగాన, అట్లే మరెట్టి ఆశలకు చలింపకుండుట ఆచార్య లక్షణము పర్వతములకు శిఖరము లందము ఆచార్యునకు కీర్తి కలిగించు శిష్యులే శోభ. కావున పర్వతములు ఆచార్యుల విశ్చలతకు, శిఖరములు ఔన్నత్యమునకు ధ్వనిగా సూచింపబడినది.

**శ్లో॥ మహాంతంశోకాభిసంతప్తంమహాధవః పీడయన్నివ**
**భరతస్యచదుఃఖేన వైదేహ్యాహరణేనచ,**

లక్ష్మణా! భరతుడు అయోధ్యానగరమునకు వెలుపలనే యుండి ఉపవాసాదులచే కృశించుచుండుటవలనను, సీతను రావణుడు హరించుకొని పోవుటచేతను, ఇదివరకే దుఃఖితుడ నగుచున్న నన్ను ఈ వసంతుడు మరింత దుఃఖింపచేయుచున్నాడు.

భావ వివరణము - సంగ్రహ తత్త్వము

కర్మచేతను, ప్రకృతి చేతను లాగబడి సంసారబద్ధులై దుఃఖించుచున్న జీవులను జూచి పరమాత్మయు విచారించుట సూచితము భరతుడు పరమభక్తుడు కాని భగవదాజ్ఞా కర్మబద్ధుడు అందువలననే అయోధ్య అనగా (భగవన్నివాసమగు వైకుంఠము) నకు వెలుపల భగవద్దర్శనము లేకున్నాడే యని తన కర్మను నిందించుకొనుచు విచారించుచున్నాడు సీత మనస్సుచే ప్రకృతి బద్ధురాలై భగవదన్య విషయమును (మృగమును) కోరి భగవానునికి దూరమై శరీర (లంకా) బద్ధురాలైనది అట్టి వీరిరువురిని తలంచుకొనిన భగవంతునకు విచారాతిశయము సూచింపబడినది వసంతుడు = సంతసింప చేసి మనస్సును ఆకర్షించువాడు కేవలము అవతారము దాల్చిన నాకే హృదయాకర్షణము చేయుచున్న యీ వసంతుడు సామాన్యజీవుల నాకర్షించుటలో నాశ్చర్యమేమి? అని ప్రకృతిచే ఆకర్షితురాలైన సీత కర్మాకర్షితుడైన భరతుడు, అను చేతనుల గూర్చి పరమాత్మ విచారించుట సూచితము

శ్లో॥ అధికం ప్రతిభాత్యేతన్నీలపీతంతు శాద్వలం
దుమాణాం వివిధైః పుష్పైఃపరిస్తోమైరివార్పితం॥

ఈ ప్రదేశము నీలముగను పచ్చగను గడ్డి మొలచి యుండుట చేతను, దానిపై రంగురంగుల పుష్పములు రాలి యుండుట చేతను రత్నకంబళము పరచినట్లు మిక్కిలి ప్రకాశించుచున్నది.

భా॥ సం॥ ఆచార్యునివలన జ్ఞానము పొంది భగవంతుని చేరదగిన పురుషుడు సూచింపబడుచున్నాడు వృక్షములు భగవద్గుణారసోపజీవులైన ఆచార్యులు పుష్పములు జ్ఞానము నకు సూచన "జ్ఞానపుష్పం" అను ఆర్యోక్తి రంగు రంగుల పుష్పములు అనగా అనేక విధములైన జ్ఞానములు. ఆ జ్ఞాన పుష్పములను తాల్చిన వారు ఆచార్యులనెడి వృక్షములు. ఎక్కడ? నీలపీతమైన శాద్వలము పైని. అదియే లక్ష్మీ నారాయణ స్వరూపము. నీలము భగవానుని వర్ణము పీతము (పచ్చని బంగారు రంగు) లక్ష్మీస్వరూపము. ఆ రెండు (శ్రీమత్ + నారాయణ) స్వరూపములు. వీనిని ఆధారముగా చేసికొని పరచబడినది, రత్నకంబళము. నీల + పీత అయిన శాద్వలముపై రత్నకంబళము పరచబడినది ఆ రత్నకంబళమే భగవంతుని చేరదగిన పురుషుడు. రత్నము స్వచ్ఛత, ఆధిక్యత కలిగినది. కంబళము యజమానిచే గాని మార్పు చేయబడనిది. ఆచార్యధీనుడగు శిష్యుడు — ఈ మూడింటిచే సూచింపబడెను. అట్లు నీల + పీత, అయిన శాద్వలము (లక్ష్మీనారాయణ స్వరూపము) దానిపై ఆధారపడిన రత్నకంబళము అనగా

(ఆచార్యాధీనుడై, స్వచ్ఛత, ఆధిక్యత కలిగిన పురుషుడు) అట్టి వానికే ఆచార్యులు అనేక విధములగు జ్ఞానములను (రంగుల పుష్పములు) ప్రసాదింతురు. ఈ శ్లోకమున వృక్షములనెడి ఆచార్యుల ద్వారా రంగురంగుల పుష్పములనెడి అనేక జ్ఞానములను పొంది నీల, పీత, శాద్వలము అను లక్ష్మీ నారాయణ స్వరూపము నాశ్రయించిన రత్నకంఠకము అను పురుషుడు ధ్వనించుచున్నాడు

శ్లో॥ పుష్పభారసమృద్ధాని శిఖరాణి సమంతతః
లతాభిః పుష్పితాగ్రాభిరుపగూఢాని సర్వశః॥

బాగుగాపూచి పూవుల బరువుతో నున్న కొమ్మలు గల వృక్షములు, పూచిన కొనలు గల లతలచే చుట్టుకొనబడి ఆలింగనము చేసికొనుచున్నట్లున్నది

భా॥ సం॥ వృక్షములు పురుషులకు, లతలు స్త్రీలకు సూచనలు బాగుగా పూచిన వృక్షములు అనగా మిక్కిలి జ్ఞానవంతులగు ఆచార్యులు. పూచిన కొనలుగల లతలు - సంసారములోనున్నను జ్ఞానవతులయిన స్త్రీలు. ఆలింగనము చేసికొనుట — గృహస్థ ధర్మములోనుండుట పుష్పములు జ్ఞానమునకు సూచన అవి పరిమళించుట అనగా జ్ఞాన వ్యాప్తి జ్ఞానవంతులయిన పురుషులు, సంసారములోనున్నను, జ్ఞాన వ్యాప్తికి సంసారము అడ్డురాదనియు, వారు నిరవధిక జ్ఞాన బోధ చేయగలరనియు, సువాసనా వ్యాపిచే సూచింపం బడినది.

శ్లో॥ పశ్యరూపాణి సౌమిత్రే! వనానాం పుష్పశాలినాం
సృజతాం పుష్పవర్షాణి తోయం తోయముచామివ॥

సౌమిత్రీ! పూవులతో ప్రకాశించు నీవనముల రూపములు ఆ పూవులను వర్షించుచుండుటచే వర్షించుచున్న మేఘములవలె కన్పడుచున్నవి.

భా॥ సం॥ పరోపదేశమే ప్రవృత్తిగా గల జ్ఞానవంతులగు ఆచార్యులు సూచింపబడిరి పుష్పములతో ప్రకాశించుట యనగా జ్ఞానసమృద్ధి కలిగియుండుట మేఘములు వర్షించుట యనగా నిస్వార్థముగా స్వపరభేదము లేకుండ జ్ఞాన వర్షము కురిపించుట వృక్షములవలె మేఘములును నిస్వార్థ దయా స్వభావము గల ఆచార్య పురుషులుగా సూచిన కొండలు, అడవులు, గ్రామములు, సముద్రములు అను భేదము లేకుండ మేఘములు వర్షించుట సహజము కావుననే మేఘములును ఆచార్యులే.

శ్లో॥ సపశ్య సుఖసంస్పర్శః వాతి చందనశీతలః
గంధమ భ్యవహన్పుణ్యం శ్రమాపనయనోఽనిలః॥

చందనమువలె చల్లనిదియు, సుగంధము నిచ్చునదియు, శ్రమను పోగొట్టునదియునగు వాయువు సుఖస్పర్శ కలిగించుచు హాయిగా వీచుచున్నది.

భా॥ సం॥ పంచ భూతములును పరమాత్మ నుండి జనించినవే "ప్రాణాద్వాయురజాయత" వాయు రూపమున

జీవులకు ప్రాణము పోయు పరమాత్మ శైత్య, మాంద్య, సౌరభ్యములతో వీచుచున్నాడు చల్లనివాడై హాయి గొల్పి, మెల్లనివాడై ఓదార్చి తాను పరిమళిస్తూ తన యందు భక్తి పరిమళమును తానే కలిగింపచేసి జీవుల కానందము గలుగ చేయువాడగు వాయు రూప ప్రాణాధార పరమాత్మ ఈ శ్లోకమున సూచితము.

**శ్లో॥ పుష్పసంఛన్నశిఖరామారుతోత్క్షేపచంచలాః**
**అమీమధుకరోత్తంసాః ప్రగీతా ఇవపాదపాః॥**

పుష్పములతో నిండియున్న కొనలు గల వృక్షములు తుమ్మెదలను శిరోభూషణములుగా గలిగియుండి గాలిచే కదల్చబడుచున్నవై గానము చేయుచున్నట్లున్నవి

భా॥ సం॥ పుష్పములతో నిండియుండుట అనగా వేద, శాస్త్రాధ్యయన జ్ఞానము కలిగియుండుట గాలిచే (వాయు రూప పరమాత్మ) నర్తించుట భగవత్కటాక్షముచే భగవదనుభవము కలిగి ఆనందోత్సాహములచే నృత్యము చేయుట. తుమ్మెదల ధ్వనియే సామగానము భగవానుడు సామగాన ప్రియుడు వాని కటాక్షముచే కలిగిన భక్తిపారవశ్యముచే ఆడుచు, పాడుచూ, సామగానము చేయుచున్న నిత్యసూరులు సూచింపబడిరి.

**శ్లో॥ పుష్పితాగ్రాంస్తుపశ్యేమాన్కర్ణికారాన్సమంతతః**
**హాటకప్రతి సంఛన్నాన్నరాన్ పీతాంబరానివ॥**

బంగారు రంగువలె బాగుగా పూచిన కొనలుగల యీ కొండగోగులను చూడుము. పీతాంబరములను ధరించి, బంగారపుటాభరణములను పెట్టుకొనియున్న మనుష్యులవలె నున్నవి

భా॥ సం॥ ఇందు భగవద్భక్తులు భగవత్ సారూప్యము చెందుట సూచింపఁబడినది. ఆచార్యుల ద్వారా భగవద్బోధనలను జీర్ణించుకొని అనన్య భక్తులై భగవత్సమీపము (పరమ పదము) నకు చేరునపుడు పరమ పదము నుండి నిత్యసూరులు ఎదురు వచ్చి ఈ చేతనులను ఆభరణాదులచే అలంకరింప చేసి భగవత్సన్నిధానమునకు గొనిపోవుదురు. కొండగోగులే భగవద్భక్తులు నిండుగా పూచుటయే సంపూర్ణానన్య భక్తి రంగు రంగులుగా నుండుటయే పీతాంబరములు. బంగారు ఆభరణములు ధరించుట సూచితము.

(భక్తులు పరమాత్మను చేరునపుడు నిత్యులు ఎదురు వచ్చుట అలంకరించుట మొదలగునవి అర్చిరాది మార్గమున ప్రసిద్ధ విషయములు)

ఇంతవరకు చేతనుడు ఆచార్యుల ద్వారా భగవద్భక్తి కలిగి శరణాగతి చేసి, భగవత్కటాక్షముతో భగవత్సారూప్యము నొంది, భగవంతుని చేరుట సూచితము.

ఈ విధముగా పరమాత్మను పొందవలసిన జీవులు అన్యాసక్తులై సంసారబద్ధులగుటకు భగవానుడు విచారించుట తరువాత సూచింపఁబడినది. వారితో కలియనిదే తానుండ

లేనట్లు విచారించుట పరమాత్మ యొక్క సౌలభ్య సౌశీల్య ముల యొక్క పరాకాష్ఠ.

శ్లో॥ నహ్యేవం రమణీయేషు శాద్వలేషు తయాసహ
రమతో వే. భవేచ్చింతా నస్పృహాన్యేషువాభవేత్॥

శ్లో॥ పద్మపత్రవిశాలాక్షీం సతతం పంకజప్రియాం
అపశ్యతో మేవైదేహీం జీవితం నాభిరోచయే॥

ఇట్టి రమణీయములగు పచ్చిక బయళ్లలో సీతతో విహరించుచున్న యెడల నాకీవిచారముండక పోవును ఇతర విషయములలో గూడ ఆశయుండదు తామర రేకులవలె విశాలమైన కనులు గలదియు, ఎల్లప్పుడు పద్మములపై ప్రీతి కలదియు నగు సీతను జూడకుండ నాకు జీవితములో రుచి లేక యున్నది

శ్లో॥ నహ్యహంజీవితుంశక్తః
తామృతేజనకాత్మజాం॥

జనకుని కుమార్తెయగు సీత లేనిదే నేను జీవించుటకు గూడ శక్తిగల వాడను కాను. నగరమున కేగిన పిమ్మట సీతను గూర్చి జనకాదులడిగిన నేనేమి చెప్పుదును? కావున నేనింటికి రాజాలను. నీవు పొమ్ము. అని పలికి దుఃఖించుచుండ లక్ష్మణుడు రామునకు ధైర్యము చెప్పినట్లు యుక్తిగా.

శ్లో॥ సంస్తంభ, రామ! భద్రంతేమాశుచఃపురుషోత్తమ!
నేదృశానాంమతిర్మందా భవత్యకలుషాత్మనాం॥

రామచంద్రా! ధైర్యమవలంబింపుము నీకు మంగళ మగుగాక! పురుషోత్తమా! శోకింపకుము నీవంటి ధీరులగు వారి బుద్ధి మందము గాదు (కుంటుపడదు) శోకము ధైర్యమును పోగొట్టును. ధైర్యము లేకున్న ఉత్సాహము నశించును. ఉత్సాహముః కంటె బలమైనది లేదు కావున ధైర్యోత్సాహ ములను వీడక సీతను వెదకుదము. దానిచే కార్యసాధన మగును.

శ్లో॥ మహాత్మానం, కృతాత్మానం, ఆత్మానం
నావబుధ్యసే॥

మహాత్ముడవైన నీవు నిన్ను తెలిసికొనలేకున్నావు అని పలికెను ఆ మాటలకు రాముడు శోకమును విడచి ధైర్య మవలంబించెను వారిరువురును సుగ్రీవుని వెదకుచుండ వారిని జూచి ఋశ్యమూక పర్వతముపై నున్న సుగ్రీవుడు, వారు వాలిచే పంపబడిన వారేమోనని భయపడి సమీపములో నున్న మతంగాశ్రమమునకు తన మంత్రులతో పారి పోయెను

భా॥ సం॥ సంసారములోఁబడి కొట్టుకొనుచున్న జీవులను జూడగా పరమాత్మకు అనిర్వచనీయమైన దయగల్గును. "కృపా కాప్యుపజాయతే" (ఏదో ఒక విధమగు దయ గల్గును)

అందుచే వారిని రక్షించుటకు మార్గము వెదకుట అదియే సీతను వెదకుట వారితో కలిసి ఆనందించుటయు, పరమాత్మ సౌలభ్యము. తానొక్కడు ఆనందింప లేడట 'సఏకాకీనరమేత' (ఆతడొక్కడే ఆనందింపలేడు) అందువలననే పరమాత్మ జీవులలో ప్రవేశించి వారికొరకై వారితోపాటు సుఖదుఃఖములలో మునిగి తేలుచుండును అదియే సీతారూపమున నున్న సీత అను జీవునకై విచారించుటయు, ఆమెను పొందగా ఆనందించుటయును.

సీతమ్మ లక్ష్మి అవతారము దానిని సూచించుటకే "పద్మపత్రవిశాలాక్షీ, పంకజప్రియా" అను లక్ష్మినామము లనే ఉపయోగించి లక్ష్మి విశిష్టుడగు నారాయణుడు ఆమెను విడచి యుండలేకుండుటను సూచించుచు సీతా విరహమును పొందు చున్నట్లు బాహ్యముగా కనబడునట్లు చూపెను.

బాహ్యముగా కేవల మానవత్వము సూచించు చున్నట్లున్న రామునకు లక్ష్మణుని మాటలు పరమాత్మను గుర్తుచేసినట్లయినది రాముడు మహాత్ముడు = అంతకంటె గొప్పవాడు లేనివాడు పరమాత్మ కృతాత్ముడు = తనంత తాను కల్పించుకొన్న జీవాత్మలో కలిసి యున్నవాడు. ఈ రెండునూ తానే అయిన విషయమును మరచెనా (తెలిసికొన లేకున్నాడా) అనునట్లును మరల లక్ష్మణుడు జ్ఞాపకము చేయు చున్నట్లుని ఆతని మాటలచే ధ్వనించుచున్నది

మతంగాశ్రమమును జేరి భయపడుచున్న సుగ్రీవుని జూచి ఆంజనేయుడు "సౌమ్యుడా! ఈ ప్రాంతమందు నీవుండగా

వాలివలన నీకు భయములేదు. వారెవ్వరో తెలియకయే ఏల పరుగెత్తెదవు? సరియగు బుద్ధితో ఆలోచించి తెలివిగా విషయమును గ్రహింపవలెను" అని పలుకగా సుగ్రీవుడు "మారుతీ! ధనుర్ధారులగు వారల రూపములు చూచిన ఎవ్వరికి భయము కలుగకుండును? రాజులు బహుమిత్రులు అందుచే "వాలియే వారిని పంపెనేమో" అని నా అనుమానం కావున నీవు ప్రాకృత వేషమును ధరించి వారి వద్దకుపోయి చక్కని సంభాషణతో వారి మాటలలో చేష్టలలో గల ఆంతర్యమును గ్రహించిరమ్ము

శ్లో॥ మమైవాభిముఖం స్థిత్వా పృచ్ఛత్వం హరిపుంగవ॥

నాకు నీముఖము కనబడునట్లుగా నిలబడి మాట్లాడుము అని పలుకగా ఆంజనేయుడు అట్లే అని భిక్షురూపమును ధరించి వారివద్దకేగెను. కాని రామలక్ష్మణులను జూచిన హనుమ తన విషయమునే మరచినాడు.

శ్లో॥ ఆబభాషే తదా వీరౌ యథావత్ప్రశశంస చ
సంపూజ్య విధివద్వీరో హనుమాన్మారుతాత్మజః॥

వారిరువురను యథావిధిగా ప్రశంసించి పూజించి యిట్లు పలికెను

శ్లో॥ రాజర్షిదేవప్రతిమౌ తాపసౌ సంశితవ్రతౌ
త్రాసయంతౌ మృగగణా నన్యాంశ్చ వనచారిణః॥

శ్లో॥ ధైర్యవంతౌ సువర్ణాభౌ కౌ యువాం చీరవాససౌ
శ్రీమంతౌ రూపసంపన్నౌ వృషభశ్రేష్ఠవిక్రమౌ॥

శ్లో॥ పద్మపత్రేక్షణౌ వీరౌ జటామండలధారిణౌ
అన్యోన్యసదృశౌ వీరౌ దేవలోకాదివాగతౌ॥

శ్లో॥ యదృచ్ఛయేవసంప్రాప్తౌచంద్రసూర్యౌవసుంధరాం
విశాలవక్షసౌవీరౌమానుషౌదేవరూపిణౌ॥

శ్లో॥ ఉభౌయోగ్యావహంమన్యేరక్షితుంపృథివీమిమాం
ఆయతాశ్చ సువృత్తాశ్చబాహవః పరిఘోపమాః॥

శ్లో॥ సర్వభూషణభూషార్హాః కిమర్థం నవిభూషిత?

దేవతలవలె మిక్కిలి సౌందర్యము కలవారై వ్రతాచరణులగు తాపసులవలెను, రాజర్షులవలెను ఉన్న మీరు పంపాతీరమందలి మృగములకు అన్యులగు వనచారులకు భయము కలుగునట్లు ఈ ప్రదేశమంతయు పరిశీలించుచు ఈ దుర్గమ ప్రదేశమునకు వచ్చుటకు కారణమేమి? బంగారు శరీరకాంతి గలవారై పంపాతీరమును ప్రకాశింపజేయుచు, సింహపరాక్రమముతో, ఇంద్రచాపముల వంటి ధనస్సులను ధరించి శత్రుసంహారము చేయుచున్నవారివలెనున్న శ్రీమంతులైన తామెవ్వరు? రాజ్యమేలుటకు తగిన వారైన మీరు ఈ ప్రదేశమునకేల వచ్చితిరి? తామరరేకులవంటి నేత్రములు కలిగి జటలు ధరించియు యాదృచ్ఛికముగ భూమికి దిగివచ్చిన చంద్రసూర్యులవలెనున్నారు.

విశాల వక్షములు కలవారై పరిఘల వంటి భుజములు కలవారై, అలంకరించు కొనతగిన వారైనను ఎందులకు అలంకరించుకొనలేదు? ఈ భూప్రదేశమునంతను రక్షించుటకు తగినవారుగానున్నారు. బుసలు కొట్టుచున్న పాములవంటి బాణములతో మీ అమ్ములపొదులు నిండియున్నది మీ కరవాలములు (కత్తులు) పొరలు విడిచిన పాములవలెనున్నవి నాతో ఏల మాట్లాడరు? ధర్మాత్ముడైన సుగ్రీవుడు సోదరుడగు వాలిచే తరుమగొట్టబడి ఋష్యమూక పర్వతముపై దుఃఖముతో నున్నాడు నేనాతని మంత్రిని 'హనుమంతుడ'ను పేరు గలవాడను సుగ్రీవుని పంపున వచ్చితిని ఆతడు తమతో స్నేహమును కోరుచున్నాడు అని యదార్థమునే పల్కెను.

భా॥ సం॥ ఈ ప్రశ్నలో ఆంజనేయుని మనోదృష్టికి రాముడు పరమాత్మగనే గోచరించినట్లు ఆతని మాటలలో ధ్వనించుచున్నది భిక్షురూపముతో వచ్చి వారి రూపములు చూడగనే మైమరచి తన యదార్థ విషయమునే చెప్పెను. 'దేవప్రతిమౌ' 'దేవతలవంటివారు' అనుటచే వారు స్వయం ప్రకాశులని తెలియుచున్నది 'సువర్ణాభౌ' బంగారము వంటి శరీర కాంతిగలవారు అనుటలో శ్రీరాముడు భగవానుడే గావున ఉపనిషత్తులలో చెప్పబడిన 'య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషః' అను (వాక్యము) సూత్రము చేత 'అంతరాదిత్య విద్యలో భగవానుని బంగారు రంగు గలవాడు అని పేర్కొనుటవలనను' 'ధ్యేయస్సదా.. హిరణ్మయవపుః' అనుటచేతను శ్రీరాముడు బంగారు రంగు గలవాడుగా మారుతి మనోదృష్టికి గోచరించియుండును. ఇక లక్ష్మణుడు

స్వయముగనే 'శుద్ధజాంబూనదప్రభః' అని శుద్ధి చేసిన బంగారు వంటి కాంతిగలవాడు గన సువర్ణాభత్వ మిరువురకు కలదు.

'పద్మపత్రేక్షణౌ' తామర రేకుల వంటి కన్నులు గల వారు అనుటచే భగవానునకు 'పుండరీకాక్షుడను సార్థక నామమును తెలియచేయు, 'యథాకప్యాసం పుండరీకమేవ మక్షిణీ' అని ఉపనిషత్తులో చెప్పబడిన ఆ లక్షణము పరమాత్మదే శేషాంశసంభూతుడుగాన లక్ష్మణుని నేత్రములు ఎఱ్ఱగా నుండుటయు సహజము.

'బాహవః' అని బహువచనము చెప్పుటచే 'ఇరువురి భుజములు' అని చెప్పవచ్చును. అంతర్యముగా శ్రీరాముడు చతుర్భుజుడుగా దర్శన మొసంగుట సూచితము

'శ్రీమంతౌ' 'శ్రీ' అనగా లక్ష్మి ఆమె కలవాడు శ్రీమంతుడు. ఆతడే నారాయణుడు 'శ్రీ' అనగా కైంకర్య లక్ష్మి అది గలవాడు లక్ష్మణుడు 'లక్ష్మీవాన్' అనియు. 'శ్రీమాన్' అనియు సౌమిత్రిని గూర్చి రామాయణములో అనేక మార్లు చెప్పబడెను. కావున వారిరువురును శ్రీమంతులే. ఈ విశేషణము శ్రీమన్నారాయణావతార సూచనకే

'యదృచ్ఛయైవసంప్రాప్తౌచంద్రసూర్యావసుంధరాం' 'యాదృచ్ఛికముగా భూమికి దిగివచ్చుట' అనగా భగవానుడు తనంతతానుగా మానవరూపము ను ధరించుటకు 'పితరం

రోచయామాస ... దశరథం" అని తానే దశరథుని తండ్రిగా వరించి భూమికి దిగివచ్చిన వాడని భావము. అదియుగాక "అజాయమానో బహుధా విజాయతే" పుట్టుకలేనివాడు అనేక విధములుగా తన యిష్టము వచ్చినట్లు పుట్టుటయు సూచితము.

చంద్రసూర్య లిరువురితో పోలిక మిత్రులకు చంద్రుని వలె చల్లగను, శత్రువులకు సూర్యునివలె తీక్ష్ణముగను ఉందురని భావము. ఆ చంద్రసూర్యు లిరువురును పరమాత్మ నుండి పుట్టినవారే, "చంద్రమామనసోజాతః, చక్షోస్సూర్యో అజాయత" అను పురుషసూక్త సూక్తిచే చంద్రసూర్య రూపములు రెండునూ సర్వేశ్వరుడే.

"రక్షితుం పృథివీమిమాం" భూమిని రక్షించుట కొరకై అవతరించిన వాడు 'రక్షించుట' అనగా సృష్టి స్థితి సంహార ములు మూడును రక్షణలోనే యున్నవి అనగా సృష్టి, స్థితి, సంహారములు చేయుటకు తగినవారని భావము. పరమాత్మ వ్యూహావతారమగు పరవాసుదేవులే సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూపములతో సృష్టి, స్థితి, సంహారము లొనర్చుట సూచితము.

వజ్రాయుధముల వంటి ధనస్సులు, పొరలు విడిచిన పాములవంటి ఖడ్గములు, బుసలుకొట్టుచున్న సర్పముల వంటి బాణములతో నిండిన అమ్ముల పొదులు ధరించి "శత్రు సంహారకులు" అన్నట్లున్న వాడు అనుటలో సర్వరాక్షస సంహారము సూచితము.

ఈ విధముగా భ,గ,వ, చ్ఛబ్ద వాచ్యుడై, నారాయణ స్వరూపుడై, చతుర్భుజుడై సృష్టి, స్థితి, లయకారకుడై, రాక్షస సంహారకుడై లీలావిహారుడై ఆంజనేయుని మనో దృష్టికి పరమాత్మయే గోచరించినట్లు అతని మాటలవలన ధ్వనించుచున్నది. కిష్కింధకాండలో 'నారాయణ' పదము యొక్క అర్థము కొంతవరకు ఈ మాటలచే సూచింపబడినది.

ఆంజనేయుని మాటలకు శ్రీరాముడు సంతసించి లక్ష్మణునితో అరిందమ! ఏ సుగ్రీవుని కొరకు మనము వెదకు చుంటిమో ఆ సుగ్రీవునిచే పంపబడిన అతని మంత్రి అయిన యీతడు మన వద్దకే వచ్చెను. అతనితో మధురముగా, స్నేహయుక్తముగా మాట్లాడుము.

అంతేగాదు –

శ్లో॥ నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః
నాసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుం॥

శ్లో॥ నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధాశ్రుతం
అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతం॥

శ్లో॥ ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీం
అనయా చిత్రయావాచా త్రిస్థానవ్యంజనస్థయా॥

శ్లో॥ కస్యనారాధ్యతే చిత్తముద్యతాసేరరేరపి
ఏవంగుణ గణైర్యుక్తా యస్యస్యుః కార్యసాధకాః
తస్యసిద్ధ్యంతి సర్వార్థాః దూతవాక్య ప్రచోదితాః॥

"ఋగ్వేదవినీతుడు, యజుర్వేదధారి, సామవేదవిదుడు, తప్ప ఇతరు లిట్లు మాట్లాడజాలరు. అపశబ్ద మేమాత్రము లేకుండుటచే వ్యాకరణ శాస్త్రజ్ఞునివలె నున్నాడు మాటలాడు నపుడు శరీర వికారము లేవియును లేవు ఆలస్యము గాని, తొందరగాని లేక చక్కని స్వరముతో మనస్సున హరించు నట్లు పలుకుచున్నాడు విచిత్రమైన శిరము, ఉరము, కంఠము, అను త్రిస్థానములనుండియు, ఉదాత్తానుదాత్త స్వరితముల తో చక్కగా మాటలాడుచున్న యీతనిపై కత్తినెత్తిన శత్రువున కైనను ద్వేషము పోయి అనురాగము కలుగును. ఇట్టి కార్యసాధకులైన దూతలున్న యెడల వారి మాటలవలననే యజమానునికి సర్వకార్యములును సిద్ధించును" అని పలికెను.

భా॥ సం॥ ఆంజనేయుని మాటలను బట్టి అతడు ఆచార్యుడుగను (తగిన) దూతగను ఉండుటకు తగినవాడని శ్రీరాముడు గుర్తించినట్లు పై వాక్యములవలన తెలియు చున్నది. వేదవేత్త శాస్త్రసంపన్నుడు, మంత్రజ్ఞుడు, విష్ణు భక్తుడు, పురాణజ్ఞుడు, దయావంతుడు, గురుభక్తియుతుడు, మాత్సర్యము లేనివాడు ఆచార్యుడుగా నుండుటకు తగిన వాడు ఈ లక్షణములు ఆంజనేయునిలో నున్నట్లు శ్రీరాముని మాటలలో నగపడుచున్నది.

ఋగ్వేద వినీతుడు — వినీతుడనగా బాగుగా శిక్షింప బడినవాడు. ఋగ్వేదమున ప్రతివర్ణము స్వరముతో కూడి యున్నందున మనస్సును దానియందే ఉంచి సావధానముగా ఉచ్చరింపబడునట్లు శిక్షితుడు కావలెను ఈతడట్లు సావధాన

ముగా మాట్లాడుటచే ఋగ్వేద వినీతుడు కావలెను. (చెప్పెడి విషయము నంగు ఏ మాటకు ఎంత పలుకుబడి కావలెనో అట్లు ఊనికతో పలుకుట) అట్లు మాటలాడు చున్నవాడు గావున ఈతడు ఋగ్వేద వినీతుడు.

యజుర్వేదధారి — ధారణ మనగా చెప్పిన దానిని జాగ్రత్తగా మనస్సునందుంచుకొనుట యజుర్వేదములో ఒకే వాక్యము అనేక పర్యాయములు చాలచోట్ల వచ్చుచుండును. ఆ తరువాత వాక్యములు మారును ఆ వాక్యమును మనస్సునందు ధరించి పల్కుటయే ధారణ. ఇది యజుర్వేదమునకు మిక్కిలి అవసరము ఏమాట తరువాత ఏది పలుకవలెనో అట్లే ఈతడు క్రమము తప్పకుండ పలుకుచున్నాడు. కావున యీతడు యజుర్వేదధారి.

సామవేదవిదుడు — "విదుడు" అనగా లోపల నున్న దానిని గూడ బాగుగా ఎరిగినవాడు. సామవేదము గాన ప్రధానమైనది ఎక్కడ ఏ స్వరము ఎంత ఎరిగి గానము చేయవలెనో బాగుగా ఎరుగవలెను. అట్లు గానము చేయుటయే విద్వత్తు ఇది సామవేదమునకు అవసరము గొంతుకలో ఏ అప స్వరమును లేకుండ మాట్లాడుట ఈతడట్లే సుస్వరముతో మాటలాడు చుండుటచే సామవేద విదుడని తెలియుచున్నది. ఇవన్నియు వేదాధ్యయన పరుని లక్షణములు

అంతేగాక "రక్షితుం పృథివీమిమాం" ఈ భూమిని రక్షించుట కొరకు అని పలుకుటచే ఋగ్వేద మందలి "బ్రహ్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" మొదలగు వానిని

బాగుగా అవగాహన చేసికొన్న ఋగ్వేద వినీతుడనియు, "మానుషౌ దేవరూపిణౌ" మానవరూపము ధరించిన దేవతలు అని పలుకుటచే యజుర్వేద మందలి "అజాయమానో బహుధా విజాయతే" ఇత్యాదులచే పరమాత్మ అనేక విధములుగా అవతరించును అని తెలియచేయు "యజుర్వేదధారి'' అనియు "పుండరీకాక్షౌ" తామరపూవులవంటి కన్నులు గలవారు "సువర్ణాభౌ" బంగారు వంటి కాంతిగలవారు అని పలుకుటచే ఛాందోగ్యోపనిషత్ లో చెప్పబడిన "యథాకప్యాసంపుండరీక మేవమక్షిణీ" "హిరణ్మయఃపురుషః" మొదలగు పరమాత్మ స్వరూపమంతయు చెప్పెడి ఉపనిషత్తులన్నియును బాగుగా ఎరిగినవాడని స్పష్టమగుచున్నది

మరియు మాటలలో అపశబ్దము లేకుండుటచే వ్యాకరణజ్ఞుడనియు, అవయవము లందు ఏవికారము లేకుండుట, శబ్ద విస్తారము లేక పదవర్ణాదులలో సందేహము లేక, ఆలస్యముగా గాని, తొందరగాగాని, కాకయుండుటచే శిక్షయందు శిక్షితుడనియు. మధ్యమ స్వరముతో హృదయమును హరించునట్లు మంగళకరమైన మాటలను బట్టి దయాది గుణములు గలిగి భగవద్భక్తియుతుడై నిర్మాత్సర్యముతో శిష్యులను సాకగల శక్తిగలవాడనియు అందుచే ఆచార్య స్థానమునకు తగినవాడనియు శ్రీరాముని మాటలలో వ్యక్తమగుచున్నది. ఆంజనేయుని ఆచార్య స్థానీయ విశిష్టత శ్రీరాముడే ఈ కాండమునందు ప్రాతిపదికగా సూచించెను.

శ్రీరాముని మాటలు వినిన లక్ష్మణుడు హనుమంతునితో "సుగ్రీవుని గుణములను మేము వినియున్నాము. ఆతనితో సఖ్యము మాకంగీకారమే" అనగా మారుతి మిక్కిలి సంతృప్తితో "అయ్యా! తామెందులకీ ఘోరారణ్యమునకు వచ్చితిరి?" అని అడిగెను అంత సౌమిత్రి.

శ్లో॥ రాజా దశరథో నామ ద్యుతిమాన్ ధర్మవత్సలః
చాతుర్వర్ణ్యం స్వధర్మేణ నిత్యమేవాభ్యపాలయత్॥

శ్లో॥ తస్యాయం పూర్వజః పుత్రో రామో నామ జనైః శ్రుతః
శరణ్యః సర్వభూతానాం పితుర్నిర్దేశపారగః॥
రాజలక్షణసంపన్నః .. గుణవత్తరః ...

శ్లో॥ అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్యముపాగతః
కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః॥

శ్లో॥ రాజ్యాద్భ్రష్టో వనే వస్తుం మయా సార్ధమిహాగతః
భార్యయా చ మహాతేజాః సీతయానుగతో వశీ॥

దశరథుడను మహారాజు మిక్కిలి తేజస్వియై అయోధ్యానగరమునకు ప్రభువుగా నుండి ధర్మమునందే ఆసక్తికలవాడై నాల్గు వర్ణముల వారిని పాలించుచుండెడి వాడు. ఈ శ్రీరామచంద్రుడాతని జ్యేష్ఠ పుత్రుడు సర్వ భూత శరణ్యుడు రాజలక్షణములతో కూడిన వాడు మిక్కిలి

గుణవంతుడు. వన్ను లక్ష్మణు డందురు. ఈ రామచంద్రుని గుణములకు దాసుడనైతిని. ఈతడు కృతజ్ఞుడు. బహుజ్ఞుడు. తండ్రి మాట నిలుప దలచి రాజ్యమును విడిచి అరణ్య వాసము చేయుచుండ మేము లేని సమయమున రావణుడను వాడు సీత నపహరించెను.

ఆ రావణుని వెదకుచుండగా కబంధుడను వాడు రామునిచే శాపమోక్షమును పొంది "సీతను వెదకుటకు సుగ్రీవుడు సమర్థుడు" అని చెప్పెను. ఆ సుగ్రీవుని కొరకై మేము వెదకుచున్నాము. ఇదమా యదార్థ వృత్తాంతము.

శ్లో॥ ఏషదత్వాచవిత్తాని ప్రాప్యచానుత్తమంయశః
లోకనాథః పురాభూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి॥

శ్లో॥ పితాయస్యపురాహ్యాసీ చ్ఛరణ్యోధర్మవత్సలః
తస్యపుత్రశ్శరణ్యశ్చ సుగ్రీవం శరణం గతః॥

శ్లో॥ సర్వలోకస్య ధర్మాత్మా శరణ్యశ్శరణం పురా
గురుర్మేరాఘవస్సోఽయం సుగ్రీవం శరణం గతః॥

శ్లో॥ యస్యప్రసాదే సతతం ప్రసీదేయురిమాఃప్రజాః
సరామో వానరేంద్రస్య ప్రసాదమభికాంక్షతే॥

"పూర్వము ఏమహానుభావుడు కోరిన వారికి సమస్తై శ్వర్యముల నిచ్చి ఉత్తమమైన కీర్తిని సంపాదించి లోక

వాదుడుగా నుండెనో, ధర్మవత్సలుడు, శరణ్యుడు అయిన దశరథునకు కుమారుడయ్యెనో, ధర్మాత్ముడై, సకల లోకము లకు శరణ్యుడయ్యెనో, ఎవని అనుగ్రహము వలన ప్రజలు తృప్తిచిత్తవృత్తి కలవారైనారో అట్టి నా అగ్రజుడగు రఘు వంశ సంభూతుడైన రాముడు వానర రాజయిన సుగ్రీవుని అనుగ్రహము కోరుచు శరణు వేడుచున్నాడు" అని పలికెను.

భా॥ సం॥ లక్ష్మణుని మాటలలో తమ వంశీయుల ప్రతిష్ఠ, అట్టి వంశము గనుకనే పరమాత్మ అందవతరించుట, పరమాత్మ యొక్క అసాధారణ లక్షణములు, అందువలననే జీవులందరును వానికి దాసభూతులగుట ప్రతిపాదింపబడు చున్నది. ద్వయ మంత్రమందలి "శరణం" అనునది సూచింప బడినది.

రఘువంశీయులు ధర్మము నందే ఆసక్తిగలవారు. నాల్గు వర్ణముల వారిని స్వధర్మములకు భంగము రాకుండ కాపాడువారు. కనుకనే భగవానుడు దశరథునే తండ్రిగా వరించెను. గుణవంతుడు—సౌశీల్య, సౌలభ్యాది సకల గుణములు గలవాడు, కనుకనే తండ్రి మాట నిలబెట్టవలచి రాజ్యమును తృణప్రాయముగా విడిచి వచ్చినాడు కృతజ్ఞుడు. చిన్న ఉపకారమునైనను గొప్పగా చెప్పుకొనువాడు, తృప్తి చెందు వాడు "కృతేనైకేన తుష్యతి" అని అయోధ్యాకాండము నందే చెప్పబడినది అంతేకాదు. "బహుజ్ఞుడు" అనేక విషయములు (అన్నియు) తెలిసినవాడు 'యస్సర్వజ్ఞస్సర్వవిత్' అను పరమాత్మ లక్షణములు కలవాడు. అట్టి భగవద్గుణములకు

లోబడిన నేను ఆతనికి దాసునిగానుంటిని 'పరవానస్మి కాకుత్‌స్థ' అన్నాను ఇదివరకే అందుచే చేతనులందరును పరమాత్మకు దాసులే అగుట సూచితము

"సర్వభూత శరణ్యుడు" కేవలము అల్పులగు జీవులకే గాదు పంచభూతములను నియమింపగలవాడు "భీషాస్మాత్ వాతఃపవతే, భీషో దేతిసూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ" ఇత్యాది ఉపనిషద్వాక్య ప్రతిపాద్యుడైన పరమాత్మయే గావున సర్వభూత శరణ్యుడు ఈ రాముడే సుమా! అంతేగాదు సర్వలోక శరణ్యుడు - లోకము లన్నింటికిని రక్షకుడు, సృష్టి, స్థితి, లయ కారకుడు సర్వసంపదల నొసగుట అనగా భక్తితో ప్రార్థించిన వారికి పునరావృత్తి రహితమైన పరమ పదమును కటాక్షించగలడు. "గచ్ఛలోకానను త్తమాన్" అన్నాడు జటాయువును.

ఈ శకులు ఒక పరమాత్మకే కలవు. ఇవి ఒక్క పరమాత్మకే సాధ్యములు. అని సూచించెను "లోకనాథః పురాభూత్వా" పూర్వ మీతడు సమస్త లోకములకు ప్రభువు సుమా! ఈ జీవులందరు ఈతని కటాక్షము చేతనే తృప్తి చెందినవారు ఈ మాటలన్నిటియందును రాముడు పరమాత్మగనే ధ్వనించునట్లు లక్ష్మణుడు పలికెను.

ఆ మాటలకు ఆంజనేయుడు సంతసించి "సుగ్రీవుడు వాలిచే అపహరింపబడిన రాజ్యమును, భార్యను గూడ పొందగలడని నిశ్చయించుకొని రామా! సుగ్రీవుడు మీపనికి

తప్పక సాయపడగలడు. రండు ఆతని వద్దకు పోవుదము" అని పలికి భిక్షురూపమును విడిచి వానరరూపుడై వారిని భుజములపై కూర్చుండ బెట్టుకొని సుగ్రీవుని వద్దకు వెళ్లెను.

భా॥ సం॥ రాముడు పరమాత్మ ఆ పరమాత్మను ఆంజనేయుడు వహించెను. పరమాత్మను వహించునది మంత్రము ఆ మంత్రమే ఆంజనేయుడు. ఆచార్య స్థానము నందుండుటకు వేదాధ్యయన పరుడేగాక బ్రహ్మనిష్ఠుడు కూడ కావలెను. "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" ఇది వరకు శ్రోత్రియుడు– వేదాధ్యయనపరుడు పరమాత్మను వహించుటచే ఆంజనేయుడు బ్రహ్మనిష్ఠుడు కూడ అయినాడు. అట్టివాడే మంత్రోపదేశార్హుడు అగు ఆచార్యుడు. ఆయన ద్వారానే జీవులు పరమాత్మను చేరవలెను. అట్లే ఇప్పుడు ఇచ్చట జీవుడైన సుగ్రీవుడు శ్రోత్రియుడై, బ్రహ్మనిష్ఠుడై, పరమాత్మను వహించిన ఆచార్యుడగు ఆంజనేయుని ద్వారానే పరమాత్మయగు రాముని పొందగలిగెను.

ఆంజనేయుడు సుగ్రీవునితో రామలక్ష్మణుల వృత్తాంతమును చెప్పి "దృఢవిక్రముడు, సత్యవిక్రముడు, పితృనిర్దేశాది ధర్మపాలకుడు అయిన రాముడు అరణ్యములో నివసించుచుండగా రావణాపహృత భార్యుడై నిన్ను శరణు కోరుచున్నాడు. వారిని ఎదుర్కొని పూజింపుము" అని పలికెను.

భా॥ సం॥ రాముడు సర్వేశ్వరుడే అయిన ఒక కోతిని శరణు కోరుట ఏమి? అనగా ఇందు పరమాత్మ యొక్క

సౌశీల్యము వ్యక్తమగుటయేగాని అతని పరత్వమునకు లోటు వచ్చుటగాదు అతనికి చేతగాక కాసికాదు బాలకాండ 1వ సర్గలో వాల్మీకి నారదుని "గుణవాన్కః" అని ప్రశ్నించెను! అచట "గుణము" అను దాని కర్థము "సౌశీల్యము" చాలా గొప్పవాడు మిక్కిలి తక్కువ వానితో గాఢమైన స్నేహము కలిగి యుండుటయే "సౌశీల్యము" "మహతోమందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః" అని శాస్త్రము అదియే సౌశీల్యము యొక్క భావము

ఇచ్చట రాముడు జ్ఞాన, బలాది సర్వ గుణములు గల వాడు సుగ్రీవుడు వానరుడు అట్టివానితో 'నీవే నేను, నేనే నీవు" అనునట్టి స్నేహము కలిగియుండెను అందువలననే తానే శరణుకోరి దాపరికము లేని సౌశీల్యము ను నిరూపించెను. సౌశీల్యము లేని పరత్వము ప్రకాశింపదుగదా! కనుకనే కృష్ణావతారమున మిక్కిలి తక్కువవారై లోకజ్ఞానము లేని వెఱ్ఱిగొల్లలచే కట్టుబడి, కొట్టుబడి వారికి స్వాధీనుడయ్యెను. కావున రాముడు సుగ్రీవుని శరణు కోరుట కేవలము సౌశీల్య ప్రకటనముకే అని ఎరుంగునది ఈ విషయము రామాయణ మున చాలచోట్ల ప్రతిపాదింపబడినది గుహుడ, జటాయువు, సుమంత్రుడు మొదలగు వారి విషయము బట్టి గ్రహించునది.

ఇక ఆంజనేయుడు సుగ్రీవునితో రాముని గూర్చి చెప్పుటలో సత్యపరాక్రమాది భగవద్గుణములను అతనికి తెలియ చేయుటకే భయస్థుడు, పాపము చేసినవాడు, తనను భగవంతుడేమి శిక్షించునో అని భయపడియుండ ఆచార్య

ముఖముగా భగవద్గుణములను విని భయము వీడి శరణాగతి చేయును అదియే "ఉపాయము" అని తెలియ చేయుచు 'శరణం' అను ద్వయమంత్ర శబ్దార్థము ఇచట సూచింపబడినది

ఇక బాహ్యముగా చూచిన రాముడు చక్రవర్తి కుమారుడు తాటకాది మారీచ దుష్టరాక్షస వధ చేసి శివ ధనుర్భంగ మొనర్చి విరాధ కబంధాది రాక్షసులను సంహరించినవాడు. అయినను ఒక వానరుని సహాయమపేక్షించుట అనగా లోకములో ఎంత గొప్పవారైనను ఒకరి పనికి యింకొకరు సాయపడి అన్యోన్యకార్యములు నెరవేర్చుకొనిన కేవలము మానవులకే గాక పశుపక్ష్యాదులకు గూడ ఐక్యమత్యము పెంపొందుననియు, దానిచే లోకము సుఖశాంతులతో నుండుననియు తెలియ చేయుటకే తన సౌశీల్యము ప్రదర్శించెనని ఎరుగునది.

హనుమంతుని మాటలు వినిన సుగ్రీవుడు మిగుల సంతసించి మానవ రూపమును ధరించి 'సకృత్వామానుషం రూపం సుగ్రీవం" రామునితో "రామా! నీవు ధర్మాత్ముడవు, పౌరుషవంతుడవు, సర్వవత్సలుడవు, వానరుడనగు నాతో చెలిమి చేయవలచిన నా చేతిని పట్టుకొని దాటరాని వ్యవస్థను ఏర్పరచుము. (చేతిలో చేయి వేయుట ఈ నాటికిని ఆచారమై యున్నది) అనగా రాము డాతని హస్తమును పట్టుకొని పీడించి ఆతనిని కౌగిలించుకొనెను వెంటనే ఆంజనేయుడు శమీసమిధలను మథించి అగ్ని పుట్టించి పూజించి వారిరువురి మధ్య నుంచగా వారా యగ్నికి ప్రదక్షిణ మొనర్చి స్నేహము

గట్టుకొని "మన యిరువురికిని సుఖదుఃఖములు సమానములు. నీ సుఖమే నాసుఖము. నీ దుఃఖమే నాదుఃఖము" అని ప్రతిజ్ఞ చేసికొనిరి

శ్లో॥ త్వంవయస్యోఽసివేంహృద్యోహ్యేకందుఃఖం సుఖంచనౌ॥

భా॥ సం॥ ఆంజనేయుని ద్వారా శ్రీరామ సుగ్రీవులకు స్నేహము కలిగెను. అనగా ఆంజనేయుడను ఆచార్యుని కృపవలన "సుగ్రీవుడను జీవుడు" "శ్రీరామచంద్రుడ"ను పరమాత్మకు సమీపవర్తి కాగలిగెను అను విషయము సూచితము.

ఇట్లు రామ సుగ్రీవులకు మైత్రి కలుగగా సీతమ్మకు, వాలికి, రావణునకు ఎడమ కన్ను అదిరినవట. ఎడమ కన్ను అదురుట స్త్రీలకు (సీతమ్మకు) శుభసూచకము. పురుషులకు (వాలీ, రావణులకు) అశుభ సూచకము. అంత సుగ్రీవుడు రామునితో "శత్రుభయంకరా! ఆరాక్షసునిచే అపహరింపబడిన నీ భార్యను ఆకాశమందున్నను పాతాళమందున్నను వెదకి తీసుకొని వచ్చియిత్తును. నాకొక చిన్న అనుమానము. ఒక రాక్షసునిచే కొనిపోబడుచున్న ఒక స్త్రీ "రామా! రామా! అనుచు మమ్ములను జూచి ఉత్తరీయమును,ఆభరణములను క్రింద పడవైచినది వానిని మేము తీసి దాచితిమి. ఆమె సీతమ్మ కావచ్చును. అని పలికి గుహ నుండి వానిని తెచ్చి రామునకు చూపెను.

ఆ యాభరణములను చూచిన రాముడు కన్నీరు కార్చుచు "హా ప్రియులారా అని దుఃఖించుచు" లక్ష్మణా! సీతచే పచ్చికపై పడవేయబడిన ఈ ఆభరణములను చూచితివా! అనగా లక్ష్మణుడు వానిని చూచి,

**శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే**
**నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్॥**

ఈ కేయూరములు, ఈ కుండలములు నేనెరుగను గాని ప్రతిదినము ఆ తల్లి పాదారవిందములకు నమస్కరించుచుండుటచే "ఈ అందెలు మాత్రము మా తల్లి సీతమ్మవి" అని గుర్తింపగలుగుచున్నాను

భా॥ సం॥ ఈ మాటలవలన శేషభూతుడైన లక్ష్మణుడు సీతారాముల సేవానిరతుడేగాని అన్యవిషయలోలుడు కాడనియు, సీతను కన్నెత్తియైన చూచి యెరుగడనియు తెలియుచున్నది.

**అంత** రాముడు "సుగ్రీవా! ఆ రావణు డెక్కడ నున్నాడు? నా సీత నపహరించిన ఆ దుష్టుని యిప్పుడే సంహరించెదను." అని పలుక సుగ్రీవుడిట్లనెను. రామా! ఆ రావణుని స్థానముగాని, ఆతని బల, సామర్థ్య, పరాక్రమములు గాని నేనెరుగను? అయినను సీతను నీవు పొందునట్లు ప్రయత్నించెదను. దుఃఖమును విడువుము చూడుము. నేనును భార్యను పోగొట్టుకొనియే యున్నాను. అయినను దుఃఖింప లేదు. ధీరుడు దుఃఖింపడు. నిన్ను ప్రార్థించుచున్నాను. విచారింపకుము అని అనునయించెను.

భా॥ సం॥ ఇచట సుగ్రీవుడు రావణుని గూర్చి తనకు తెలియనట్లు మాట్లాడెను ఇదియొక రాజకీయము. అప్పుడగు ఏ రాజయినను తన కార్యము నెరవేరనిదే ఎదుటి వారి కార్యము నెరవేర్ప సిద్ధపడడు. కాక సుగ్రీవునకు మరియొక భయము కూడ కలదేమో అనిలోచుము ఏమనగ రావణుని గూర్చి ముందుగానే రామునకు చెప్పినచో అప్పటి పరిస్థితిని బట్టి భార్యాసక్తుడగు రాముడు వెంటనే సీతాన్వేషణమునకు పంపదలచిన తన వద్ద తగినంత సైన్యము లేదు వాలి వధ జరుగనిదే వానర వీరులందరును తన పక్షము కాగు అందుచే (వానర వీరులు లేకుండుటచే) సీతాన్వేషణము జరుగదు. కావున ముందు వాలి వధ జరిగి వానరులు తన పక్షము కావలెను అంతేగాక రామ, సుగ్రీవులు భార్యాసక్తులై మిత్రులయినారన్న విషయము వాలీ రావణులకు తెలిసిన యెడల వారిరువురును ఏకము కావచ్చును. వారిరువురును వీరిరువురకు శత్రువులు కదా! శత్రువు లిరువురు బలవంతు లేకమైన కనీసము సైన్యమైన లేక తామిరువురు ఏమిచేయ గలగని అనుమానించెను అందుచే తమ యిరువురి కార్యములు భంగముగాక సక్రమముగా నెరవేరుటకు ముందుగా వాలి వధ జరుగుట మంచిదని రామునితో తనకు రావణుని గూర్చి తెలియనట్లు మాట్లాడి ఆతనికి ధైర్యము చెప్పి దుఃఖితుడు కాకుండగ చూచుటకై ప్రయత్నించి యీ విషయమును (రావణుడు తనకు తెలియనట్లు మాట్లాడుట) మరుగు పరచి యుండవచ్చునని చెప్పుదురు.

(బహూశః ఈ విషయము రాముడు గ్రహించియుండ వచ్చును) కనుకనే సుగ్రీవుని మాటలు విని రాముడు కన్నీరు తుడుచుకొని "సుగ్రీవా! హితము ను కలిగించు మిత్రుడెట్లు పలుకునో అట్లే పలికినావు ప్రస్తుతము నేనేమి చేయవలెనో చెప్పుము నావలన అన్ని పనులు ముగియునని సత్యముగా చెప్పుచున్నాను" అని పలుకగా సుగ్రీవుడు తన కార్యము నెర వేరినట్లే సంతసించెను.

**భా॥** సం॥ ఇచట రాముడు ఆభరణ దర్శనముచే రావణుని వెంటనే చంపవలయునని సిద్ధపడుట "పరమాత్మ దుఃఖితులగు చేతనులపైగల వాత్సల్యాతిశయముచే వారిని శీఘ్రముగా రక్షింపవలెననెడి "త్వర"యు దుష్టశిక్షణ చేయుటలో ఆసక్తియు సూచింపఁబడినది." అన్ని పనులు నావలన ముగియును అనుటచే సర్వశక్తులు గలవాడు గావున దుష్ట వాలీ, రావణుల శిక్షించుటయు, తద్వారా శిష్టరక్షణము ధర్మసంస్థాపనయు జరుగ గలదను సూచనయు చేయబడెను.

అంత సుగ్రీవుడు "రామా! నీదయచే సురరాజ్యమైనను పొందగలను. స్వరాజ్యమును పొందుట కాశ్చర్యమేమి? అగ్ని సాక్షిగా మనము మిత్రులము. మిత్రుని బంగారము మొదలగు వస్తువులు తన సొమ్ముతో సమానములు. ధనికుడు, దరిద్రుడు, దుఃఖి, సంతోషి, దోషి, నిర్దోషి అనుభావము లేకయే కార్య సాధనములో నాతడుపయోగపడును. అట్టి మిత్రునకై, ధనము, సుఖము, దేహము కూడ విడువవచ్చును." అనిపలికి చిగుళ్లతో పూలతో నిండిన ఒక సాలవృక్షపు కొమ్మను

తెచ్చి దానిపై రాముని కూర్చుండచేసి తానును ఒక ప్రక్క కూర్చుండెను

భా॥ సం॥ సుగ్రీవుడు మిత్రలక్షణములను ఇచట చక్కగా వివరించెను. మిత్రులు అర్థాసనాధిష్ఠితులగుట అతి మిత్రత్వ సూచన కావున రాముని ప్రక్కనే ఒకే ఆసనముపై తాను కూడ కూర్చొనెను

పిదప రాముడు "సుగ్రీవా! నీకు వాలితోగల వైర కారణమును తెలియచేయుము. దానిని బట్టి తరువాత కార్యమును చేయుదును" అనెను.

భా॥ సం॥ ఇచట రాముని ధర్మమార్గమును గమనింప వలెను వాలి చేసిన అపరాధమేమిటో వివరముగా తెలియ నిదే ఆతనిని చంపిన అధర్మమగును కాక యిందు సుగ్రీవుని దోషమేమయిన నున్నదేమో! ఇరువురివలనను దోషము లున్నను, లేదా వాలి యపరాధము సామాన్యమైనదైనను, ఇరువురను సమాధాన పరచి శాస్త్రదూష్యము కాకుండ వారిని కలపవచ్చు వాలి అపరాధము పెద్దదే అయి సుగ్రీవుని వలన దోషము లేని యెడల వాలికి దండనము తప్పదు. అని ఆలోచించి వారి వైరము గూర్చి అడిగెను.

సుగ్రీవుడు తమ వైరము గూర్చి యిట్లు చెప్పెను. "ఋక్షరజస్సు" అను వానర రాజుకు జ్యేష్ఠ పుత్రుడైన వాలి వానర రాజ్యమును పాలించుచుండగా రెండవ కుమారుడనైన నేను అతనికి ప్రియము చేయుచు సేవకునివలె నుంటిని.

పూర్వము ఒకప్పుడు "మయుని" కుమారుడగు "మాయావి" కిని "వాలి"కిని స్త్రీ కారణముగా వైరము గలదట అందుచే మాయావి ఒక నాటి రాత్రి మా అన్నపైకి యుద్ధమునకు రాగా మా అన్న మిక్కిలి కోపముతో యుద్ధమునకు తలపడగా మమ్ములనందరను జూచి భయపడి "మాయావి" పారిపో సాగెను. నేనెంత వలదని బ్రతిమాలుచున్నను వినక మా యన్నయు వాని వెనుక పరుగెత్తసాగెను నేనును మాయన్న యందలి ప్రేమచే ఆతడొంటివాడగునని వారి వెనుకనే వెళ్లితిని.

కొంత దూరము పోయి మాయావి ఒక అడవిలో గడ్డితో కప్పబడిన ఒక భూవివరములో ప్రవేశించెను. నేనెంత చెప్పినను వినక మాయన్నయు నన్నచటనే యుండమని పలికి మాయావితో గూడ ఆభూవివరముననే ప్రవేశించెను.

సంవత్సరమైనను వాలి రాలేదు ఒకనాడు ఆ వివరము నుండి రక్తము ప్రవహింప వాలి ఆర్తనాదమును, మాయావి సైన్యము యొక్క బొబ్బలును వినబడెను అందుచే వాలి చనిపోయి యుండునని తలచి మాయావి బయటకు వచ్చు నేమోయని భయపడి ఆ కన్నమునకు ఒక పెద్ద రాతిబండ అడ్డుపెట్టి దుఃఖించుచు అన్నకు ఉదకదానము చేసి యింటికి వచ్చితిని. ఈ విషయము ను నేను చెప్పకపోయినను మంత్రులు ఎట్లో తెలిసికొనిరి.

శ్లో॥ శోకార్తశ్చోదకం కృత్వా కిష్కింధా మహాగతస్సఖే
గహాహమానస్యమేంతత్వందయంత్మతోవంంత్రిభిశంత్రతం
తతోఒహంత్రైస్సమహాగమ్యసమ్మత్తై రభిషేచితః॥

రాజు లేని రాజ్యము ఆపదలపాలగునని మంత్రులు ప్రజలును ఇష్టపడి నాకు పట్టాభిషేకము కావించిరి కొన్నాళ్లకు వాలి వచ్చి నేనాతనికి నమస్కరించి పాదములు పట్టుకొని యదార్థ విషయ మంతయు చెప్పుచున్నను వినక నన్ను నిందించుచు నా మంత్రులను చెరలో నుంచి కట్టుబట్టలతో దేశము నుండి వెడలగొట్టెను.

శ్లో॥నిర్వాసయామాహాస తదా వస్త్రేణైకేనవానరః
తేనాహంపవిద్ధశ్చ హృతదారశ్చరాఘవ॥

అంతేగాక నా భార్యను గూడ అపహరించెను అందులకు మిక్కిలి చింతించి వాలి భయముచే దేశములన్నియు తిరిగి తిరిగి యిక్కడకు వాలి రాడని యిందుంటిని. నాయందను రాగముగలవారు నాతో నున్నారు నన్నను గ్రహింపుము. అని కన్నీరు కార్చుచు పలికెను. శ్రీరాముడు సుగ్రీవుడు ప్రాణభయముచే చేసిన అల్పదోషమును, వాలి మూర్ఖత, అహంకారము ముఖ్యముగా రుమాహరణము మొదలగు దోషములను గ్రహించి దుష్టుడైన వాలిని సంహరింతునని ప్రతిజ్ఞ చేసెను.

కాని సుగ్రీవుడు వాలి బలమును తలంచుకొని భయపడుచు "రామా! వాలి మిక్కిలి బలవంతుడు. బ్రాహ్మీ ముహూర్తము (చుక్క పొడుచు మొదలు సూర్యోదయము) లోనే నాల్గు సముద్రములకు వెళ్లి సూర్యోపాసన చేయగలవాడు పర్వత శిఖరములను బంతులవలె ఆడగలవాడు ఒకప్పుడు "దుందుభి" అను రాక్షసుడు పోతరించి, సముద్రుని, హిమవంతుని తనతో యుద్ధమునకు రమ్మని పిలువగా వారు యుద్ధము చేయలేక వాలి వద్దకు పంపిరి

వేయి యేనుగుల బలము కలిగిన దుందుభి మహిష (ఎనుబోతు) రూపము ధరించి రాగా వానితో యుద్ధము చేసి వాలి వానిని చంపెను ఆకళేబరమును చూచితివా! కొండవలె నున్నది. ఈ కళేబరమును వాలి యోజనము పైకి ఎగురవేయగా దాని నోటినుండి కారిన రక్తబిందువులు ఈమతంగాశ్రమముపై బడినవి. అది చూచి మతంగ మహర్షి కోపించి "ఈ కళేబరమును తన్నినవాడు ఈ ప్రాంతమునకు వచ్చిన యెడల చనిపోవుగాక" అని శాపమొసగెను అందుచేతనే వాలి యిచ్చటకు రాడను ధైర్యముతో ఇక్కడనున్నాను. చూచితివా! ఆసాలవృక్షముల నేడింటిని. వానిలో ఒక్కొక్క దానిని వాలి నాశనము చేయగలడు" అని పలికెను.

సుగ్రీవునకు తన శక్తిపై నమ్మకము కలుగలేదని శ్రీరాముడు గ్రహించి ఆతనికి నమ్మకము కలుగుటకై దుందుభి కళేబరమును కాలి బొటన వ్రేలితో పదియోజనముల దూరము పైకి చిమ్మివేసెను కాని ఆ కళేబరము ఎండి

శుష్కించుటచే తేలికయినదని సుగ్రీవున కింకను రాముని శక్తిపై నమ్మకము కలుగలేదు. వెంటనే రాముడు ఒక బాణమును తీసి సుగ్రీవుడు చూపిన సాలవృక్షములపై ప్రయోగింపగా ఆ బాణము ఏడు సాలవృక్షములను ఛేదించి పర్వత ప్రస్థము నుండి భూమిని చీల్చుకొనిపోయి తిరిగి శ్రీరాముని అమ్ముల పొదిలో ప్రవేశించెను. వెంటనే సుగ్రీవుడు మిక్కిలి ఆనందాశ్చర్యములతో రాముని పాదములపై బడి నమస్కరించి చేతులు జోడించి "మహాత్మా! నీవు సమస్త సురలతో గూడిన దేవేంద్రుని సైతము జయింపగల వాడవు వాలి యొక లెక్కయా! ఒక్క బాణముతోనే ఏడు సాలములు, పర్వతము, భూమియు కూడ ఛేదింపఁబడినవి. నీవు అజేయుడవు నీ ప్రతిజ్ఞ ప్రకారము వాలిని సంహరింపుము అని ప్రార్థించెను.

భా॥ సం॥ జీవుడు భగవచ్ఛక్తినిగూడ అనుమానించుట సహజము దానిని భగవంతుడే పోగొట్టవలెను. అట్లే సుగ్రీవుడు శ్రీరాముని శక్తిని అనుమానించెను. ఆ శక్తిని ఒకసారి చూచి నమ్మకము కలిగి శరణు కోరి పాదములపై బడెను ఇందు భగవద్విషయమున చేతనుడు చేసిన అజ్ఞానము వలన కలిగిన అపరాధమును ఆ చేతనుడు శరణుకోరి భగవంతుని పాదములపైబడి మన్నింప వేడుట సూచితము. "చరణౌ శరణం" అను ద్వయమంత్రము స్పష్టమైనది.

అనంతరము సుగ్రీవాదులు కిష్కింధ సమీపమున కేగగా మిగిలినవారు చెట్లమాటున నుండగా సుగ్రీవుడు

వాలిని యుద్ధమునకు పిలిచెను. వాలి మిక్కిలి కోపముతో వచ్చి సుగ్రీవుని చావగొట్టుచున్నను రాముడు బాణ ప్రయోగము చేయలేదు. సుగ్రీవుడు వాలిచే చావుదెబ్బలు తిని భయపడి మరల ఋశ్యమూకమునకు పరిపోయెను

భా॥సం॥ ఇచట సుగ్రీవుని భాగవతాపచార దోషము ను పెద్దలు చెప్పుదురు ఇంతవరకు సుగ్రీవుడు రాముని గాని మహాభక్తుడు భాగవతోత్తముడు అగు లక్ష్మణుని పట్టించుకొనలేదు ఆంజనేయుడు రామలక్ష్మణుల నిరువురను సమానముగా గౌరవించి ప్రశ్నించెను. ఈతడట్లు చేయక సీతమ్మ నగలు రాముడు లక్ష్మణునకు చూపి గ్రహింపుమన్నప్పుడు లక్ష్మణుడు పలికిన మాటలు వినికూడ అతనిని గూర్చి కనీసము ఒక్కమాటయిన పలుకలేదు. లక్ష్మణుడు ఆచార్య స్థానీయుడైన పరమభాగవతోత్తముడు ప్రపన్నుడు భగవంతునికి మిక్కిలి ప్రియుడు అట్టి భాగవతోత్తముని ఆచార్యుని గుర్తింపక పోవుట సుగ్రీవుని దోషము. అట్టి ఆచార్యులను మరచిన శిష్యులగతి యెట్లుండునో యిచట సూచితము. అట్టి వారిని భగవానుడు కూడ ఉపేక్షించును ఆచార్యుల ద్వారాగాని పరమాత్మ జీవులను అనుగ్రహింపడనుట స్పష్టమగుచున్నది ఆంజనేయుడనెడి ఆచార్యుని ద్వారా సుగ్రీవుడను జీవుడు రామపరమాత్మను చేరగలిగెను పరమాత్మకు మిక్కిలి ప్రీతిపాత్రులగు పరమభాగవతోత్తము లను విస్మరించుట అపరాధమై భగవదుపేక్షకు కారణమగును "ప్రతిబధ్నాతిహి శ్రేయః పూజ్యపూజా వ్యతిక్రమః" పూజింపదగినవారిని పూజింపక పోవుటయు కార్యవిఘ్నము కదా!

సుగ్రీవుని వెనుకనే రామానుజులును ఋశ్యమూక పర్వతమునకు రాగా సుగ్రీవుడు చిన్నబోయి "రామా! ముందుగా నీబలపరాక్రమములు చూపి వాలిని యుద్ధమునకు పిలువుమనియు, వానిని చంపుదుననియు పలికి ఆతడు నన్ను చావగొట్టుచుండగా చూచుచు నూరకుండుట నీకు న్యాయమా!" అని పలుక రాముడు ఆదరముతో "సుగ్రీవా! మీరిరువురును వేషముచేతను యుద్ధగమనాదులందును ఒకే విధముగా నుండుటచే పొరపాటున నా బాణము నీకే తగిలిన మహాపాతకము కలుగునే గాక మిత్రహత్యాపాతకము గూడ నాకు చుట్టుకొనును గదా! అందుచే నేను బాణప్రయోగము చేయలేదు. మేమందరము సిద్ధముగా నుంటిమి. మరల వాలిని యుద్ధమునకు పిలువుము. ఈ మారు తప్పక చంపెదను" అని ప్రతిజ్ఞ చేసి "లక్ష్మణా! యీ సుగ్రీవుని గుర్తుపట్టుటకు బాగుగా పూచిన యీ గజపుష్పలతను ఈతని కంఠమున వేయుము "గజపుష్పీమిమాం ఫుల్లాం.." అని పలికి సుగ్రీవుని లక్ష్మణుని వద్దకు పంపెను "రామాజ్ఞచే లక్ష్మణుడు గజపుష్పలతను త్రెంచి తెచ్చి సుగ్రీవుని మెడలో వైచెను.

భా॥ సా॥ జీవుడు సర్వేశ్వరుని పొందుటలోను సర్వేశ్వరుడు జీవుని అనుగ్రహించుటలోను గూడ పురుషకారభూతుడగు ఆచార్యుడుండవలెను. ఆచార్య కటాక్షము కలుగనిదే జీవుడు భగవంతుని పొందలేడు. ఆచార్యుని ద్వారా పరిశుద్ధుడైన వానిని గాని సర్వేశ్వరుడాదరింపడు. "త్రిశంకుడు ఆచార్యుల మాట వినకుండుట చేతనే గదా! స్వర్గమునకు పోలేకపోయెను. అట్లే సుగ్రీవుడు భంగపడి మరల ఆచార్య

స్థానీయుడైన లక్ష్మణునిచే పుష్పితలతాధారణా రూపముగా సంస్కరింపబడి భగవత్కృపకు పాత్రుడయ్యెను శ్రీరామ చంద్రుడు సుగ్రీవునకు లక్ష్మణుని ద్వారా పుష్పితలతా ధారణము చేయించుట అనగా "మంత్రోపదేశముచే జ్ఞానము కలిగించుట" అని భావము" పుష్పము జ్ఞాన సూచకము కదా! తద్వారా భగవత్కటాక్షము కలుగునని సూచింప బడినది

గజపుష్పీ లతను ధరించిన సుగ్రీవునితో కలిసి మరల అందరును కిష్కింధా సమీపమున కేగుచుండ త్రోవలో సుగ్రీవుడు "సప్తజనాశ్రమము"ను జూపి "రామా! వీరు కేవలము పరమాత్మధ్యాన తత్పరలు వీరికి నమస్కరించిన అశుభములు తొలగి శుభములు చేకూరును" అని పలుకగా రామాదులందరును దూరము నుండియే వారికి నమస్కరించి కిష్కింధా సమీపమున కేగిరి.

సుగ్రీవుడు వాలిని మరల యుద్ధమున కాహ్వానించుచు సింహనాదము చేసెను. ఆ ధ్వనికి వాలి తేజోవిహీనుడయ్యెను అయినను లక్ష్యము చేయక మిక్కిలి కోపముతో బయలు దేరెను. భార్యయగు తార వాలిని వారించుచు "ప్రభూ! ఏలయీ తొందర? కోపమును విడువుము. రేపు సుగ్రీవునితో యుద్ధము చేయవచ్చును. సుగ్రీవు డొకమారు వచ్చి నీచే దెబ్బలు తినిపోయి మరల వచ్చి పిలుచుటచే నాకేదో సందేహము కలుగుచున్నది. ఆతని గర్జన అతడు సహాయము గలవాడుగా తోచుచున్నది. ఆతడు బుద్ధిమంతుడు తగిన

వానితో గాని స్నేహము చేయుదు ఇంతకు ముందే అంగదుడు ఆప్తులైన చారులు చెప్పిన విషయమును చెప్పినాడు

దశరథుని కుమారులును, అతిశూరులును అగు రామ లక్ష్మణులు ఋశ్యమూక పర్వతమునకు వచ్చియున్నారట. ప్రళయాగ్నివలె శత్రువులను నాశనము చేయు రాముడు సుగ్రీవునకు సహాయుడట ఆ రాముడు.

శ్లో॥ నివాసవృక్షస్సాధూనాం ఆపన్నానాం పరాగతిః
ఆర్తానాం సంశ్రయశ్చైవ యశసశ్చైకభాజనం॥

శ్లో॥ జ్ఞానవిజ్ఞాన సంపన్నః నిదేశేనిరతఃపితుః
ధాతూనామివశైలేంద్రోగుణానామాకరో మహాన్॥

రాముడు పుణ్యపురుషులకు నివాస వృక్షము ఆపద చెందినవారికి పరాగతి. (తిరుగులేని ఆధారము) ఆర్తులకు ఆశ్రయింపదగిన వాడు కీర్తికి తగిన స్థానమైనవాడు అతడొక్కడే. జ్ఞాన విజ్ఞానములు గలవాడు, పితృవాక్య పాలకుడు. ధాతువులకు హిమవంతునివలె గుణములకు ఆ రాముడే స్థానమైనవాడు. అట్టి మహాత్మునితో వైరము వలదు. నాహితము విని నీ సోదరుడగు సుగ్రీవుని లాలించుము. యువరాజుగ ఒనర్చుము ఇట్టి బంధువు నీకు భూమిలో లేదు కావున అతనిని దానాదులచే మెప్పించి ద్వేషము మాని ఆదరింపుము. శ్రీరామునితో వైరము పెట్టుకొనవలదు అని పలికెను. కాని ఆ మాటలు వాలి లెక్కచేయలేదు.

భా॥ సం॥ రామాయణమున రామరహస్య మెరిగిన రమణీయమణులు ముగ్గురు. 'సుమిత్ర' మొదటిది. రెండవది 'తార' 'మండోదరి' మూడవది అయోధ్యాకాండమున కౌసల్యతోనూ, లక్ష్మణునితోనూ సుమిత్ర పలికిన మాటలలోనూ, యుద్ధకాండమున రావణ వధానంతరము మండోదరీ విలాపమున రాముని గూర్చి పలికిన మండోదరి మాటలలోనూ రాముడే పరమాత్మయని స్పష్టమగుచున్నది అట్లే కిష్కింధాకాండమున తార వాలితో పలికిన మాటలలోనూ వాలిమరణానంతరము రామునితో పలికిన మాటలలోనూ గూడ రాముడే పరమాత్మయని భేరీమ్రోతగా చాటబడుచున్నది. చూతము

నివాసవృక్షస్సాధూనాం - సాధువులు నివసించుటకు తగిన వృక్షము. వృక్షము తనను ఆశ్రయించిన వారికి ముందుగా నీడనిచ్చి సేదదీర్చి పిదప ఫలాదుల నొసగి వారిని యెట్లు తృప్తి పరచునో అట్లే పరమాత్మయను వృక్షము గూడ సాధువులై తనను ఆశ్రయించిన జీవులను ఓదార్చి కోరికలను దీర్చును. ఆ వృక్షమే "వాసుదేవతరువు"

**శ్లో॥ వాసుదేవతరుచ్ఛాయా నాతిశీతానఘర్మదా**
**నరకాంగారశమనీ॥**

అనునట్లు వాసుదేవుడను చెట్టు యొక్క నీడ మిక్కిలి చలవ, వేడిగాక నరకమనే అగ్నిని గూడ శమింపచేయునది ఆ వాసుదేవతరువే యీ శ్రీరాముడు సుమా.

సాధువులనగా సంసార తాపతప్తులు. వారికి శ్రమను పోగొట్టి విశ్రాంతి నొసగునది వాసుదేవతరువు (వృక్షము) సాధువులనగా జ్ఞానులు, ఉపాసకులు వారికి విశ్రాంతి స్థానము పరమాత్మ ఆ పరమాత్మయే నివాస వృక్షము, ఆ వృక్షమే రాముడు కావున నే సాధువై తనను ఆశ్రయించిన సుగ్రీవుని ఓదార్చి అభయ మొసగెను.

ఆపన్నానాం పరాగతిః - ఆపద చెందినవారికి పరాగతి' అనగా అంతకంటె గొప్పది మరొకటి లేని ఆధారము. దుఃఖించుచున్న జీవులను గూర్చి 'యోగక్షేమంవహామ్యహం' అనుచు వారికి ఉన్నదానిని కాపాడుచు, లేని దానిని కలుగ చేయుచు దేనిని అయిన నీయగలవాడు అనగా అకించనులై శరణు కోరిన వారికి తిరిగి రానట్టి ప్రాప్తిస్థానమును (పరమ పదమును) ఇచ్చువాడు ఈ లోకములో కావలసినవన్నియు సమకూర్చి "సంసార సాగరములో పడితిమే" అని బాధపడు వారికి ఆ ఆపదనుండి రక్షించి, తిరిగి రానిదగు 'పరమపదము' అను స్థానమును పొందింపగలవాడు అతడే యీ రాముడు సుమా!

ఆర్తానాం సంశ్రియశ్చైవ - ఆర్తులు ఆశ్రయించుటకు తగినవాడు. ఆర్తులు=ప్రపన్నులు - పరమాత్మను పొందుట కొరకై బాధచెందుచున్నవారు "నీవేతప్ప యితరులు నాకు రక్షకులు కారు" అనుటయే ప్రపత్తి అట్టి ప్రపత్తికలవారు ఆశ్రయింపదగినవాడు తాము మరియొక రక్షణ ఆలోచించిన యెడల తటస్థుడైయుండును. కావున అనన్య శరణ్యులై తే

ప్రపన్నులు. వారాశ్రయించుటకు తగినవాడు. ప్రారబ్ధముచే జనన మరణములను పొందుచున్న వారే ఆర్తి చెందినవారు. అట్టివారు ఆశ్రయించినచో క్షణములో వారి కోర్కెలు తీర్చగలవాడు ఆశ్రయించిన సుగ్రీవుని కోర్కె తీర్చుటకు సద్గుణగణసంపన్నుడగు రాముడే ఆపదమాత్ర సుమా!

యశసశ్శ్రియైక భజనః — కీర్తికి తగినవాడతడొక్కడే. పైని చెప్పబడిన మహత్తర కార్యములు చేయగలవాడాతడొక్కడే ఇంకొకడు లేడు కావున ఆతడొక్కడే ఆకీర్తికిని తగినవాడు

“తస్యనామమహద్యశః” అను వేదోక్తిని బట్టి ఆతడే కీర్తి—అకీర్తి. శౌర్య ప్రతాపములవలన కలుగునది రాజ్యమువీడుట లో ఔదార్యము, తాటకాదుల సంహారము లో పరితాపము ప్రత్యక్షముగదా!

సాధువులనగా భగవత్ప్రాప్తిని గోరువారు ఆపన్నులనగా కైవల్యము గోరువారు, ఆర్తులనగా ఐశ్వర్యము గోరువారు. వారి వారి ఆయా కోర్కెలు తీర్చువాడు ఆతడొక్కడే కాన ఆకీర్తికి ఆతడొక్కడే భజనము (స్థానము) ఆతడే యీ గుణముకు సుమా!

జ్ఞానవిజ్ఞాన సంపన్నః — జ్ఞాన, విజ్ఞానములతో గూడినవాడు జ్ఞానమనగా లౌకిక జ్ఞానము, దానిచే ఆశ్రితులకు ఫలము నిచ్చుట విజ్ఞాన మనగా శాస్త్రజన్య జ్ఞానము. ధర్మముగా రాజ్యపాలనాదుల నిర్వర్తించుట. “మోక్షేధీః

జ్ఞానం అన్యత్ర, విజ్ఞానం శిల్పశాస్త్రాదికం" అనియు పండితుల వాక్యము. జ్ఞానశక్తి, బలైశ్వర్యాదులు గలవాడే యితడు లౌకిక జ్ఞానముతో లోకుల కోర్కెలు తీర్చును, విజ్ఞానముతో ధర్మశాస్త్ర ప్రకారము పితృవాక్య పరిపాలనము, ప్రతిజ్ఞాదుల చేయు నాతడే గాన పరమాత్మ సుమా!

గుణానామాకరోమహాన్ - గుణములకు గొప్ప స్థానమైనవాడు 'గుణము' అనగా సౌశీల్యము. తానెంత గొప్పవాడైనను తక్కువ వారితో కలిసి యుండుటయే సౌశీల్యము రాముడు తాను చక్రవర్తి కుమారుడైనను, అల్పుడైన నావికునకు, పక్షియైన జటాయువు కోతియైన సుగ్రీవుడు కూడా తనవారేయని ఆత్మీయత చూపినవాడు. సర్వజగత్తుకు కారణమైనవాడు, పరమాత్మ ప్రకృతి సంబంధము లేనివాడు తనచే సృష్టింపబడిన ప్రతిదానియందు 'ఇది' 'అది' అనక ఉండువాడు "అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామ రూపే వ్యాకరవాణి" తాను సృష్టించిన ప్రతివస్తువు నందును దానితోనే లోపల ప్రవేశించి ఒక నామము, ఒక రూపము కల్పించువాడు ఆతడే రాముడు

రాముడనగా రమింప (ఆనందింప) చేయువాడు. "రమయతి ఇతి రామః" అంతేకాదు "యోగినః అస్మిన్ రమంతే ఇతి రామః" యోగులు ఆతని యందు రమింతురు కావుననే రాముడైనాడు ఆ రాముడే భగవానుడు. కావున ఆతనితో వైరము పెట్టుకొనవలదు. అని తార పలికిన పలుకులలో రాముడే పరమాత్మ అను గుర్తింపు అంతరార్థముగా తెలియ చేయబడెను

ఆ మాటలు వినిన వాలి అహంకారముచే నిర్లక్ష్యముగా నవ్వుచు "తారా! శత్రువు గర్జించుచు ఎదురు నిలిచి యుద్ధమునకు పిలుచుచుండ వెళ్ళకుండుట వీరుల లక్షణము గాదు భీరువు (పిరికివారల) లక్షణము. సుగ్రీవుని అహంకారము నేను సహింపజాలను. ధర్మజ్ఞుడు కృతజ్ఞుడైన రాముడు నిరపరాధుని చంపునట్టి పాపము చేయునా! నాయందు నీకుగల స్నేహము ను చూపితివి. నీమాట ప్రకారము సుగ్రీవుని చంపను. వాని ఔద్ధత్యమును అణచెదను." అని పలికి యుద్ధమునకు వెడలెను. తార దుఃఖించుచు ఆతనికి జయము కోరుచు అంతఃపురమున కేగెను. వినాశకాలము సమీపించి మృత్యువుచే ఈడ్చుకొని పోబడు వాలికి తార మాటలు రుచింపలేదు.

వాలి మిక్కిలి రోషముతో వచ్చి అగ్నివలె మండుచు సుగ్రీవుని చూచి "ఈ పిడికిలిపోటు నీ ప్రాణములను తీయగలదు" అనగా సుగ్రీవుడును "అట్లే" అనెను. ఇరువురును కొంతసేపు ముష్టి యుద్ధము చేసిరి. ఆర్తుడైన సుగ్రీవుని చూచి రాముడు సర్పము వంటి బాణమును ప్రయోగించెను. అది తగిలి వాలి ఇంద్రధ్వజమువలె నేలగూలెను.

అంత రామలక్ష్మణులు వాలిని చూచుటకు రాగా ఆతడు రాముని అధిక్షేపించుచు "రామా! ధర్మాత్ముడనని పేరు పెట్టుకొనిన, నీవు ఇతరులతో యుద్ధము చేయుచున్న వానిని అధర్మ యుద్ధము చేసి చంపుట తగునా! నీకుగాని నీవారికిగాని నేనేమియు అపరాధము చేయలేదే. క్షమాదమాదులతో కూడిన రాజు అపరాధము చేసిన వారిని దండింపవలెను

గాని యిట్లు నిరపరాధులను దండించి లోకములో సత్పురుషు లకు ఏమి చెప్పెదవు? సుగ్రీవుడు నన్ను చంపుట యుక్తము. మృగమునైన నావలన నీకేమి జరిగినది? ఏమి యుపయోగము? నీవు చేసినది ధర్మమే అయిన సమాధాన మొసగుము" అని పలుకగా రాముడు వాలి అధిక్షేపమును పరిహరించుచు సమాధానముగా ఇట్లనెను

వానరా! నాపైగల రోషముచే లౌకికాచారము, శిష్టాచారము, ధర్మశాస్త్రము తెలిసికొనక నన్ను నిందించు చున్నావు నేను చేసినది ధర్మమో కాదో నేను చెప్పబోవు మాటలను బట్టి ఆలోచింపుము వినుము పర్వత, వన, నదీ, నదములతో కూడిన యీ భూమి యంతయు ఇక్ష్వాకు వంశీయు లైన రాజులది దానిని భరతుడు ధర్మమార్గమున పాలించు చుండ మేము రాజధర్మముతో ఆతని ఆదేశమును నిర్వర్తింతుము పర్వత వనాదులలో గల క్రూరమృగములను గూడ నిగ్రహించుట, అనుగ్రహించుట మావిధి. నీవు నిరప రాధివని, మృగమవని యంటివిగదా! వినుము తమ్ముడు, శిష్యుడు కొడుకులతో సమానులు, ఆ తమ్ముడు జీవించి యుండగా ఆతని భార్యను బలాత్కారముగా అనుభవించు చున్నావు.

శ్లో॥ అస్యత్వంధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః
రుమాయాంవర్తసేకామాత్స్నుషాయాంపాప
కర్మకృత్॥

కూతురు కోడలు, మరదలు వీరితో క్రీడించువారికి ధర్మశాస్త్రము ననుసరించి మరణమే శిక్ష, తమ్ముడు బ్రతికి యుండగా మరదలితో క్రీడించుచున్న నీకు మరణ శిక్ష ధర్మ శాస్త్రము ప్రాంము తగిన పేకదా!

ఇక సుగ్రీవుడు నాకు లక్ష్మణుని వంటి సోదరుడు మిత్రుడు అతనికి నాకును దార రాజ్యనిమిత్తముగా స్నేహము కుదిరినది ఆపదలందెనను మిత్రుని విడువక అతని పనియే తన పనిగా అది ఎట్టిదైనను చేయుట ధర్మశాస్త్రము మూ యిరువురము అగ్నిసాక్షిగా స్నేహము చేసికొని ఆ సమయమున వానరుల ముందు నేను నిన్ను "స్నేహితుని విషయమున అపరాధము చేసిన వానిగా" వధింప ప్రతిజ్ఞ చేసితిని. నా ప్రతిజ్ఞ నేను నిలుపుకొనుట ధర్మమే కదా! ఇట్లు నా యెడల అసత్యతాదోషము నాకు అంటకొనును.

అట్లయిన ఎదురుగా పిలిచి పోరరాదా అందువేమో? అది శాస్త్ర విరుద్ధము శిష్టాచారాసమ్మతము ఏమన? నేను సార్వభౌమ పుత్రుడనగు క్షత్రియుడను నీవు క్రూరమృగమవు. సార్వభౌములు క్రూరమృగములతో ఎదురు నిలచి పోరాడుట నింద్యమని శాస్త్రము శిష్టాచారము తెలుపుచున్నవి. కూడ కాదు కాక వేట రాజులకు విహిత ధర్మము పంజరముగాని, గోవులనుగాని బాధకలిగించు క్రూరమృగముల నెట్లు ఉన్నను, ఎదురుగాగాని, చాటుమాటుగాని, వలతోగాని, మచ్చుపెట్టిగాని వానిని చంపిన రాజునకు దోషముండదు "ప్రముత్తానప్రమత్తాన్వా ... ... ... విధ్యంతి విముఖాంశ్చాపి

"నచ దోషోత్రవిద్యతే" శాస్త్ర విహిత ధర్మముగూడ అయిఉన్నది. నీవు క్రూరములైన పనులు చేయుచు అన్యాయముగ సాధు బాధయొనర్చిన మృగమవు। గాన నిన్నెదురుగానిల్చి చంపకుండుట శాస్త్రదూష్యముగాదు అందుచే దానికై నీవు నన్ను నిందింపనక్కరలేదు. నేను రాజును నీవు క్రూర మృగమవు. గాన నీతో ఎదురునిల్చి పోరాడుట అయుక్తము.

"నేను నీకేమి అపరాధమొనర్చితినంటివి" స్నేహితుడగు సుగ్రీవునకు చేసిన అపరాధము చాలు. నేమను సుగ్రీవుడును "ఏకం దుఃఖం సుఖంచనౌ" అని ప్రమాణము చేసికున్న వారము. సుగ్రీవునకు చేసిన అపకారము నాకు చేసినట్లేకదా! కాక లోకములో తన ప్రజలలో ఎవరికి అపకారము జరిగినను రాజు లేకదా శిక్షింపవలసినవారు అట్లు కానిచో బలవంతుడు బలహీనుని బాధించుచునేయుండెను. మరియు ఇందువలన నీకేమి ప్రయోజనమంటివి శిష్ట రక్షణమే నాకు ప్రయోజనము నీవు ఇతరులకు బాధాకరుడవగుటచే వారి బాధలుం తొలగించుటయే క్షత్రియ లక్షణముగాన నీకు మరణమే దండనము క్షతాత్-త్రాయతీ-ఇతి క్షత్రియః

ఇందులకుముఖ్యమైన మరియొక ధర్మశాస్త్రమువినుము క్షత్రియులు అష్టదిక్పాలకుల అంశములలో పుట్టినవారు. వారు దుష్టులను శిక్షించియే తీరవలెను. అట్లు శిక్షింపకున్న ఆదుష్టులు చేసినపాపము ఆ రాజ్యమేలు సార్వభౌమునకు సంక్రమించును. ఆదుష్టులను శిక్షించినచో వారు చేసిన

పాపము నశించి వారు స్వర్గమునకు పోదురు. రాజునకు గూడ పాపముంటదు సుగ్రీవుడు మంత్రుల యుక్తిడిచే రాజ్యాభిషిక్తుడయ్యు నీవు రాగానే రాజ్యసర్వస్వము నీకిచ్చి పాదముల పై బడి "తాను నిరపరాధిన"ని ప్రతిమాలినను వినక అతనిని ఇంటి నుండి కట్టుబట్టలతో వెడలగొట్టుటయే గాక అతడు ప్రతికియుండడగనే అతని భార్యను రుమను అపహరించి బలాత్కారముగా క్రీడించుచున్నావు అది అధర్మము గాదా? ఇట్టి అధర్మ ప్రవర్తకుడవగు నిన్ను వధించి నీపాపమును పోగొట్టి నీకు స్వర్గమును ప్రసాదించి నాకు సంకోమించు పాపమునుగూడ పోగొట్టుకొనుట ధర్మమగనో కాదో బాగుగా నాలోచింపుము. ఇప్పుడు తెలిసినవా! ధర్మసూక్ష్మములు? శాస్త్ర, లౌకిక, శిష్టాచారములును? "అని పలికెను"

ఆమాటలు వినిన వాలి ధర్మస్వరూపమను తెలిసికొని పశ్చాత్తప్తుడై, రామునిలో దోషము లేదనియు, తనయందే దోషము కలదనియు, అందుచే తనకీశిక్ష తగినదేయనియు నిర్ణయించుకొని, రామా! ధర్మ స్వరూపుడవగు నీవు చెప్పినది ధర్మ న్యాయ సమ్మతమైనది నిన్ను అన్యాయముగా నిందించితిని. నా అపరాధమును మన్నింపుము నీవు ఉత్తములకు హితముచేయువాడవు. నాకు తగిన దండనము విధించితివి. సద్గతి కలిగినది నా గూర్చి విచారము లేదు. సుగ్రీవుడుండుట బంధువుల గూర్చియు విచారము లేదు. కాని అంగదుడు దీనుడై పరితపించునేమోయని నా విచారము ఆతడు గొప్పబలము కలవాడు నీ ప్రీతికి పాత్రుడు వానిని

నీవు సంరక్షింపుము. సుగ్రీవుని మీది ప్రీతి అంగదునిపై కూడనుంచుము నా అపరాధముచే దీనురాలైన తారను సుగ్రీవుడు అగౌరవము చేయకుండచూడుము" అని పల్కెను.

రాముడును వాలిని ఓదార్చి "అధర్మ మార్గమున ప్రవర్తించుచున్న నిన్ను నేను శిక్షించుటకు మనమిరువురమును పాపమును తొలగించుకొంటిమి. అంగదుని విషయమై నీవు భయపడవలదు ఆతడు నీయందు వలెనే నాయందును సుగ్రీవునియందును కూడ భక్తితో ఉండగలడు" అని పలుకు చుండగనే బాణపుదెబ్బలకు వాలి మూర్ఛపోయెను.

అంతలో తార వాలి వధ విని అంతఃపురము వదలి వచ్చుచుండగా వాలి పక్షీయులైన వానరులు శ్రీరాముని చూచి భయపడి తారతో "అమ్మా! రామునిచే వాలి చంపబడెను శత్రువులు లోనికి రాకుండగనే అంగదునికి పట్టాభిషేకము చేసి రాజ్యమును కాపాడుకొనుము" అని పలుకగా, తార దుఃఖించుచు

శ్లో॥ పుత్రేణ మమ కిం కార్యం కిం రాజ్యేన కిమాత్మనా ?
కపిసింహే మహాభాగే తస్మిన్ భర్తరి నశ్యతి।
పాదమూలం గమిష్యామి తస్యైవాహం
మహాత్మనః॥

మహాత్ముడగు వాలియే మరణింప నాకీపుత్రుడెందులకు? రాజ్యమెందులకు? రామ బాణముచే కొట్టబడిన నా భర్త

పాదములవద్దకే నేను పోవుదును” అనుచు వాలి పడియున్న చోటికి వెళ్లెను. అచట రామ లక్ష్మణులను చూచెను. శ్రీరామ దర్శనముతో తార మనస్సు కొంత శాంతించినది. కాని ప్రక్కనే రామబాణాభిహతుడై పడియున్న భర్తను చూచి మరల దుఃఖములో పడిపోయెను

తారనుజూచి అంగదుడును, వారిరువురను జూచి సుగ్రీవుడును విచారించుచుండగా శ్రీరామునకు గూడ దుఃఖము కలిగెనట.

**భా॥** సం॥ శ్రీరాముని దర్శించగనే తార మనస్సు కొంత శాంతించెను. అనగా పరమాత్మ దర్శనము సాత్త్విక భావము కలిగించునని తెలియుచున్నది అయినను ఎంతో కాలమునుండి ప్రకృతి సంబంధము కలిగియున్నందున ఆ వాసనవలన ఆయా ఆత్మీయ వస్తువులను చూడగనే మరల ప్రకృతి లోబడుట సహజము. అందుచే వాలిని చూడగనే మరల దుఃఖము కలిగెను. దుఃఖించు జీవులను చూడగనే పరమాత్మకు కూడ జాలికలిగి, కృప కలుగును “కృపా కారుణ్య పజాయతే” అనునట్లు సంసారమున కొట్టుకొనుచున్న వారినిజూచి వారిపై కృపకలుగుటచే, తానును విచారించును.

అయోధ్యాకాండలో రాముని ప్రజాభిమానమును గూర్చి చెప్పుచు వాల్మీకి,

**శ్లో॥ వ్యసనేషుమనుష్యాణాం భృశంభవతి దుఃఖితః॥**

అన్నాడు. తన రాజ్యములో ప్రజలలో ఎవరికి ఏ చిన్న

విషయములోనైనా దుఃఖముకలిగిన యెడల తానెంతో దుఃఖించేవాడట. "అయ్యో! నేను అశ్రద్ధగా పరిపాలన చేయుటవలననేకదా! వీరికి దుఃఖము కలిగినది." అనుకొనే వాడట కావుననే యీనాడుకూడ తనవాడగు సుగ్రీవుని దుఃఖము రామునకు గూడ విచారకరమయ్యెనని భావము.

క్రిందబడి మూర్ఛిల్లియున్న వాలిని చూచి తార "ఓ మహావీరుడా!" హంసతూలికాశయ్యపై పవ్వళించవలసిన నీవు మరణశయ్యనలంకరించితివా! ప్రియురాలివగు నన్ను విడిచి భూమిని ఆలింగనము చేసికొనుచున్నావా! నీవు సుగ్రీవుని భార్య నపహరించి పాపము చేసితివి దాని ఫలమును అనుభవించుచుంటివి నేనును అంగదుడును అనాథులమైతిమి. ఇక నాకెన్ని కష్టములపాలగునోకదా! రాజా! ఏల నాతో మాట్లాడవు సుగ్రీవా! ఇక నీవు నిశ్శంకముగా రాజ్యమును రుమనుగూడ ఏలుకొనుము" అనుచు వాలి శరీరముపైబడి దుఃఖించుచు ప్రాయోపవేశమునకు సిద్ధపడెను.

శ్లో॥ వ్యవస్యత ప్రాయముపోపవేష్టుం అనింద్యవర్ణా భువియత్రవాలీ॥

సమీపమునున్న ఆంజనేయుడు తారను జూచి అమ్మా! తెలిసినా, తెలియకపోయినా దోషములుచేసిన ప్రాణి దాని ఫలితమును అనుభవింపక తప్పదు నీటి బుడగవంటి యీ దేహమునకై ఏల విచారించెదవు? దేహములు అస్థిరములు నీ కుమారుడగు అంగదుని రక్షించుకొని రాబోవు హితము

నాలోచించుకొనుము. ఈ అంగదుడు పట్టాభిషిక్తుడై నీవు పోషించుచుండగా రాజ్యము చేయగలడు. సింహాసనమందు కూర్చున్న నీ కుమారుని చూచుచు శాంతిని పొందగలవు. "అని పలికెను. కాని తార అందులకంగీకరించక యే" ఆంజనేయా! నూరుగురు అంగదులైనను వాలికి సమాను లగుదురా! కావున నేనును వాలితోడనే పోవుదును. అంగదుని విషయమై సుగ్రీవుడే చూచుకొనును. నేను ప్రాయోపవేశ మొనర్తును" అని పలికెను.

**కా॥ సం॥** ఇచట ఆంజనేయుని మాటలు గుర్తింపవలెను ఆతని సమయస్ఫూర్తి, తార అభిప్రాయము తెలిసికొనుట, రాజకార్యములలో సూక్ష్మగ్రాహిణియగు తార చనిపోకుండ ఆమెకు శాంతికలిగించుట, అంగదునకు యువరాజు పట్టాభిషేకమునకై పునాది వేయుటయు, గమనింపదగిన విషయములు. అంతకు ముందు మాయావిచే వాలి హతుడయ్యెనని సుగ్రీవుడు తిరిగి వచ్చినపుడు అంగదుడున్నను సుగ్రీవునకే పట్టాభిషేకము చేసిన వానరులు, మంత్రులు, ఈనాడు అంగదునకు చేయుదురా! చేయరు. అట్లు చేసిన అంగదుడు సుగ్రీవునకు దూరస్థుడగును అంతేగాక వాలి పత్నియగు తార కూడకట్టుకొని తార రాజకీయ చాతుర్యము నుపయోగించుకొని అంగదుడు సుగ్రీవునకు వ్యతిరేకియై (తన తండ్రిని చంపించెనను కోపముతో) యుద్ధమునకు సిద్ధపడునేమో, రామునిపై కక్షకట్టి కాలుదువ్వునేమో? అంగదాదులు దూరమైన సుగ్రీవునకు బలముతగ్గి సీతాన్వేషణ, రావణునితో యుద్ధము మొదలగునవి చాల కష్టసాధ్యములగును. అట్లు

గాక అంగదుడు యువరాజుగానున్న యెడల కార్యదక్షురాలయిన తార ఇంక యెటు పోవుటకు వీలులేక అంగదునిపై గల ప్రేమ, యువరాజనెడి తృప్తి కలిగి, అంగదునితో పాటు సుగ్రీవునివద్దనే యుండవలసివచ్చును. అట్లు తారాంగదులిరువురును సుగ్రీవుని విడువకుండుటకును, వానరులలో భేదము రాకుండ (శ్రీ)రామ కార్యము నిర్విఘ్నముగా నసాగుటకును ఉపయోగించు అంజనేయుని ఈ మాటలు అతని రాజనీతి చాతుర్యమునకు గీటురాళ్ళవంటివి.

ఇచట తార పల్కిన మాటలను సమంజసములే. భర్త విషయమై ప్రేమచూపుటయేగాక అంగదుని విషయమై చక్కని వ్యూహ రచన చేసినది. "ఇకపై సుగ్రీవుడే అంగదుని విషయము చూచుకొనును" అనుటలో అంగదునిపై సుగ్రీవునకు అభిమానము కలుగవలెననియేగదా!

శ్లో॥ పితృవ్యస్తస్య సుగ్రీవస్సర్వ కార్యేష్వనంతరః
పితా హి బంధుః పుత్రస్య నమాతా హరిసత్తమ।

లోకములో పితృసంఖ్యాని వారు కుమారులను పోషించి సరిదిద్దుట ఆచారము. తల్లి తాత్కాలిక ప్రియము మాలోచించును తండ్రి మున్ముందు క్షేమమాలోచించును కావున "తండ్రి వంశవాడగు సుగ్రీవుడే అన్నిటికిని బాధ్యుడు" అని తార పలుకుట సుగ్రీవుడంగదుని ఆదరించుటకే అనియు, ఈ మాటలు ఆమె దూరదృష్టికి తార్కాణము లనియు ఊహించుకొనవచ్చును.

అంతలో వాలికి కొంచెము తెలివివచ్చెను. ప్రక్కనున్న సుగ్రీవునిచూచి "సుగ్రీవా! నిన్ను అన్యాయముగా ఇల్లు వెడల కొట్టించి నీ భార్య నపహరించి దోష మొనర్చితిని. అందువలన నాకీశిక్ష న్యాయమైనదే ఇంక నీవు నాపై పగవిడచి ఈ వానర రాజ్యమును న్యాయధర్మములతో పరిపాలింపుము చరమానస్థలోనున్న నామాట కాదనక చేయుము. బుద్ధి మంతుడు బలవంతుడు అయిన అంగదుని, కడుపున పుట్టిన బిడ్డవలె చూచుకొనుము. ఈ తార సుషేణుని కూతురు. సూక్ష్మవిషయములను గ్రహించుటలో మిక్కిలి నేర్పుకలది. ఈమె చెప్పినవన్నియు చేయుము. శ్రీరామ కార్యమును తప్పక నెరవేర్పుము. శ్రేష్ఠముగు ఈ వజ్ర భూషితముగు బంగారు హారము గ్రహింపుము" అనిమాల సుగ్రీవునకీయగా సుగ్రీవుడు దీనుడై వజ్రభూషితమైన కాంచనమాలను గ్రహించెను.

శ్లో॥ శక్రదత్తా వరామాలా కాంచనీ వజ్రభూషితా
దధార హరిముఖ్యస్య ప్రాణాస్తేజః శ్రియంచ సా॥

వజ్రములు పొదగబడిన ఆ బంగారు హారము దేవేంద్రునిచే నీయబడినది. ఆ మాలయొక్క శక్తివలననే ఇంతవరకు వాలియొక్క ప్రాణములు, తేజస్సు, శోభయు నిలిచియున్నది

భా॥ వి — ఈ మాలను గూర్చి యొక గాథకలదు వాలి దేవేంద్రుని అంశవలన జన్మించినవాడు. ఇంద్రుని

కుమారుడు గావున వానర రాజ్యమునకు రాజుగా వాలిని పట్టాభిషేకము చేసిరి ఆ సమయమున ఇంద్రుడు ఈ బంగారు మాలను తన కుమారుడగు వాలికిచ్చెను ఆమాలనుధరించినచో ఆతడు అజేయుడగునని ఇంద్రుడు వరమొసగెను ఆమాల కంటె శక్తివంతమైన మాల మరియొకటి యున్ననే గాని ఆమాల ధరించిన వానిని జయించుట కష్టము. అందువలననే ఆమాలయొక్క శక్తిని క్షీణింపచేయుటకు మరొక గజపుష్పలతనే శ్రీరామచంద్రుడు సుగ్రీవునకు లక్ష్మణుని ద్వారా ధరింపచేసెను. ఆగజ పుష్పలత శక్తి ఇంద్రుని వజ్ర భూషిత కాంచనమాలాశక్తిని, క్షీణింపచేసెను సృష్టి స్థితి, లయ కారకుడగు పరమాత్మ శక్తిముందు ఇంద్రుని శక్తి ఏమాత్రము, ఇంద్రునే సృష్టించినవాడు పరమాత్మ ఆ పరమాత్మయే రాముడు. ఆ రాముడిప్పించినదే గజపుష్పలత దానిని ధరించి వెళ్లినందువలననే సుగ్రీవుడు వాలిని జయింపగలెగెను. ఇంద్రుని వరము నష్టము గాకుండ ఆ మాలయొక్క శక్తి వాలిని చాలసేపు కాపాడెను. దానిని సుగ్రీవునకు ఇచ్చిన వెంటనే వాలియందలి తేజస్సు మొదలగునవి క్షీణించెను

వాలి మొదటిమారు యుద్ధమునకు వచ్చినపుడు మాలారహితుడగనే యుండవచ్చును. మాలధరించియే యున్నచో వాలిని పోల్చుకొనుటలో రామునకు కష్టము కాదుకదా! కాని అప్పుడు సుగ్రీవుడు చేసిన భాగవతాపచారమునకు అతనికి చిన్న శిక్ష వేసియుండవచ్చును రెండవమారు సుగ్రీవుడు వాలిని యుద్ధమునకు పిలిచిన సుగ్రీవుడదో శక్తి

కలవాడై యుద్ధమునకు వచ్చియుండుననియు మాలధరించి వాలి యుద్ధమునకు రాగలడనియు "ఆశ్చర్యము" నే శ్రీరాముడు వాలి ధరించినది బంగారుమాల వజ్రభూషితమై యుండగా, తాను కేవలము గజపుష్పలతతో పోల్చుకొనుటను వీలుగా ధరింపచేసెను." అని పెద్దలు చెప్పుదురు.

వాలియు అంగదునకు రాజుల విషయమై యెట్లుండవలెనో బోధించెను. తార భర్తపై బడి దుఃఖించుచుండగనే వాలి ప్రాణము అనంతవాయువులలో లీనమైపోయెను. వాలి మరణము ఆతని మాటలు, తారాంగదుల దుఃఖము చూచిన సుగ్రీవునకు మిక్కిలి దుఃఖముకలిగి మనస్సు మారిపోయినది ఆతడు రాముని చూచి "రామా! నాసోదరుని మృతిచే నాకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది కేవలము రోషమునకు వశ్యుడనై అన్నను శత్రువుగా భావించి నీచే వధింపచేసిన నాకు నిష్కృతిలేదు. నేను పాపాత్ముడను. అగ్ని ప్రవేశముచేసినగాని యీ పాపము భస్మముకాదు. ఈ హనుమదంగదాది వానర వీరులందరును మిక్కిలి బలవంతులు వీరిచే నీ కార్యము నెరవేరగలదు నాకు అనుజ్ఞనిమ్ము" అని పలుకగా శ్రీరాముడు కంటతడి పెట్టుకొనుచు క్షణకాలము నిర్విణ్ణుడయ్యెను.

శ్లో॥ సంజాత బాష్పః పరవీర హంతా
రామో ముహూర్తం విమనా బభూవ॥

శత్రువీరులను నాశనము చేయగల వాడైనను

శ్రీరామచంద్రుడు కన్నీరు కార్చుచు క్షణకాలము నిర్విణ్ణుడై మనసు మనసులో లేనట్లుండెను.

వ్యా॥సం॥ జీవుల దీనస్థితియు, తాపత్రయాదులచే బాధపడుటయు చూచిన పరమాత్మకు వారిపై జాలికలిగి వారితోబాటు తానును దుఃఖితుడగునట. జీవులకొరకై దుఃఖము లేనివాడు దుఃఖించును. రాముడు సుగ్రీవునితో స్నేహము చేసికొనునప్పుడే "ఏకందుఃఖం సుఖంచనౌ" నీ దుఃఖమే నా దుఃఖము నీ సుఖమే నాసుఖము" అని అనుకొనిరి. కావుననే సుగ్రీవుని దుఃఖము తన దుఃఖముగా భావించి తానును సుగ్రీవునివలె దుఃఖించెను శ్రీరామ చంద్రుని సౌశీల్యమునకు ఇది మరియొక వజ్రపు తునక —

అనంతరము వానర స్త్రీలు తారను లేవనెత్తి తీసుకొనిపోవుచుండగా ఆమె రామునిచూచెను మొదటిమారు చూచినపుడే ఆమెలో సత్వగుణముదయించెను. ఇప్పుడు రాముని యొక్క పరదుఃఖ దుఃఖిత్వము చూచుటతో రాముడు సామాన్య వ్యక్తిగాకాక ఆతనిలోని పరమాత్మ స్వరూపమే తారకు గోచరించెను.

శ్లో॥ "తారాచారు నేత్రాం"

తార అందమైన నేత్రములుగలదట నేత్రములకందము భగవద్దర్శనమే ఆదర్శనము చేయనేసినాడు ఆ నేత్రములు కేవలము రంధ్రములే, అదేపనయము." శ్రీమన్మహా

భాగవతమున భాగవతోత్తముడగు ప్రహ్లాదుడు —"

"సురక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు" అంటూ యింకా తృప్తి లేక

"కమలేశు చూడని కన్నులు కన్నులే తనుకుడ్య జాల రంధ్రములుగాక॥ అన్నాడు కనుక కన్నుల సార్థకత భగవద్దర్శనమే ఆ కన్నులే అందమైన కన్నులు అంత అందమైన కన్నులు గలదిగనుకనే తార రామునిలోనున్న పరమాత్మను దర్శింపగలిగెను.

శ్లో॥ దర్శగామం శరచాపపాణిం
స్వతేజసా సూర్యమివ జ్వలంతం॥

శ్లో॥ సుసంవృతం పార్థివ లక్షణైశ్చ
తంచారు నేత్రిం మృగశాబనేత్రా
అదృష్ట పూర్వం పురుష ప్రధానం
అయం స కాకుత్స్థ ఇతి ప్రజజ్ఞే॥

శ్లో॥ సాలం సమాసాద్య విశుద్ధ సత్వా
శోకేన సంభ్రాంత శరీర భావా
మనస్వినీ వాక్యము వాచ తారా
రామం రణోత్కర్షణ లబ్ధ లక్షం

ధనుర్బాణములను ధరించి సూర్యునివలె ప్రకాశించుచు అదృష్ట పూర్వుడు, పురుష ప్రధానుడుఅయి రాజలక్షణముల తోఁగూడి చారునేత్రిడై పురుషోత్తముడైన రాముని మృగ

శాబ నేత్రియైన తార విశాలమైన నేత్రములతో (కన్నులు పెద్దవిచేసి) ఆ రూపమునుచూచి "ఈతడే వాలిని చంపిన రాముడు అని నిశ్చయించుకొని ప్రకృతిలో బడుచు అంతర్యమున పరమాత్మ దర్శనముచే విశుద్ధమైన సత్వస్వభావము కలదియై మనసులోని కాలుష్యము పోవ ఇట్లు పలికెను.

భా॥సం॥ తార రాముని లో భగవానునే దర్శించెను. శరచాపములు రెండును ధరించినవాడు ఆమె మనోదృష్టికి శంక చక్రములు ధరించినవాడుగాఁదోచెను. సూర్యునివలె ప్రకాశించువాడు పరమాత్మ కనులనుండియే సూర్యుడు జన్మించెను. "చక్షోస్సూర్యో అజాయత" కావున రామ పరమాత్మ సూర్యునివలె ప్రకాశించుట వింతగాదు "అదృష్ట సూర్యుడు" అదివరకు చూడబడినవాడు సామాన్యులకు కాదుగదా! యోగులకుగూడ, వాక్కునకు మనస్సునకు గూడ, అందనివాడు "యతో వాచోనివర్తంతే, అప్రాప్య మనసా సహ" అను ఉపనిషద్వాక్య ప్రకారము యోగుల మనస్సుకే అందనివాడు సామాన్యుల, చర్మ చక్షువులకు గోచరించునా! కావున అదృష్ట పూర్యుడు తార మనోదృష్టికి గోచరించినవాడు.

పురుష ప్రధానుడు, పరమాత్మ ఒక్కడే పురుషుడు (పురు + సనోతి = సంపూర్ణముగా ఇచ్చువాడు) అతడే అంతర్యామిత్వముగలిగినవాడు. మిగిలిన జీవులందరు స్త్రీలే అనగా ధరింపబడువారు అని భావము, "చారునేత్రిడు"

అందమైన నేత్రములుగలవాడు. అనగా పుండరీకాక్షుడు– భగవానునకు మాత్రమే పుండరీకాక్ష నామము" కః పుండరీక నయనః పురుషోత్తమః కః?" అను స్తోత్రములో చెప్పబడుచున్న ఆ రెండు లక్షణములను తార యీ రాముని యందే చూచినది ఎట్లు చూడగలిగినది? కారణమేమి? ఇది వరకే తాను "చారునేత్ర" అన్నారు ఇప్పుడు "మృగశాబ నేత్ర" అన్నారు అనగా లేడికూన కన్నులవలె విశాలమైన కనుపాపలుగల కన్నులుగలది తార కన్నంతయు పాపయే (నల్లగ్రుడ్డు) అంతవైశాల్యము అందము కలిగియున్నందుననే ఆమె రామునిలో పరమాత్మను ఆంతర దృష్టితోనూ, రాముని బాహ్య దృష్టితోను చూడగలిగినది. నేత్రములలో అందము వైశాల్యము, నిశిత దృష్టిప్రకాగ్రత కలిగి యుండుటవలననే తార రామునిలోగల పరమాత్మ దర్శనము చేసుకున్నది. కనుకనే (భగవద్దర్శనము కలిగినది) మాలిన్యము (రాజ సతామసములు) తొలగి సాత్త్విక భావము కలిగి రాముని నిందించుటకు వచ్చియు స్వామిని స్తుతించుటయే ముందు వాక్యములలో భాసించును. చూడుడు.

శ్లో॥ త్వమప్రమేయశ్చ దురాసదశ్చ
జితేంద్రియశ్చోత్తమధార్మికశ్చ
అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః

భా॥సం॥ తార పలికిన యీ మాటల చే శ్రీరాముడే భగవంతుడని నిరూపించబడుచున్నది త్వమప్రమేయశ్చ =

నీవు అపరిమేయుడవు. ప్రమాణమనగా కొలత— "ఇంత" అని కొలతలేని మహామహిమ కలవాడవు. ఎవరికైన ఏదైన ఒక శక్తి లేక మహిమ కలిగియున్నయెడల దానికొక పరిమితి "ఇంత" అని యున్నది. కాని పరమాత్మ మహిమ కొలత లేనిది (దానిని వేదములుగూడ తెలిసికొనజాలవు "వేదాహమేతం పురుషం మహాంతం ... ........ ఇత్యాదులచే" ఇంత మహిమ కలవాడు "అని వేదములచేతగూడ తెలిసికొనబడనివాడు. ఎదురుగా కనపడుచున్నను మనస్సుచేతగూడ ఆలోచింపశక్యముగాని మహిమగలవాడు, శరచాపములు ధరించియున్నను శంఖ, చక్రములు ధరించినట్లున్నవాడు "సౌలభ్యము" కూడ "ఇంత" అని చెప్పుటకు వీలుకానివాడు ఏ పరికరములు లేకున్నను ప్రతాపాతిశయముచే అంతులేని పరికరములు కలవానివలె అవగాహనకానివాడు. అట్టి పరమాత్మ స్వరూపుడవు నీవే సుమా!

దురాసదశ్చ — నీవు దురాసదుడవు "సమీపింప శక్యము కానివాడు. పొందశక్యము కానివాడు దేనిచేత? మనస్సుచేత గూడ ఎవరికి? అపమార్గమున నడుచువారికి, అనగా సన్మార్గమున, నడుచువారికి మాత్రమే పొందగలిగిన వాడు అని అర్థము "పరమాత్మ నిత్యుడు కావుననే వేరుగ (అలిడు లేకుండగ) విభాగింపతగనివాడు. ఆతడు నిత్యానందుడు. కనుకనే మనము దుఃఖములు కలిగింప సాధ్యపడనివాడు. అనగా తనంత తానే కలిగించుకొనును సర్వత్రనుండువాడు అగుటచే చలనము లేనివాడు. అట్టివానిని ఎచ్చట సమీపింప

గలము వాలిని వధించుటచే వాలి బంధువులందరును కోపించిరి కాని వారెవ్వరికిని దరిచేర వీలుకాని వాడయ్యెను. అంతేగాదు, బాహ్యమైన సుదృష్టిగల పతనాదములచేగూడ చలింపని వైభవముకలవాడు కనుకనే ఎన్నిమతములు భారతమును కప్పికొన ప్రయత్నించినను, వేదమాతను మాత్రము మార్చలేవు అందుచేతనే నీవు దురాసదుడవు

జితేంద్రియశ్చ — నీవు ఇంద్రియములను జయించినవాడవు. పైని చెప్పిన, అప్రమేయత్వ, దురాసదత్వ, మహాత్వములున్నను రాజ్యశ్రీ, కాంక్షలు లేక ఇంద్రియ లోలుడుగాక యుండువాడు. తాను పొందవలసిన రాజ్యమునుగూడ నిస్పృహతో విడిచి తన శక్తిచే సంపాదించిన సుగ్రీవుని రాజ్యమాలినికే కటాక్షించినవాడు. అయోధ్యాకాండలో కైకేయి,

శ్లో॥ న బ్రాహ్మణ ధనం కించిత్ హృతం రామేణ
కస్యచిత్।
నరామః పరదారాన్వై చక్షుర్భ్యామపి పశ్యతి॥

రాముడు బ్రాహ్మణాదుల ధనమును హరింపడు. పరస్త్రీలను కన్నెత్తియైన చూడడు "అని శ్రీరామునిగూర్చి ప్రశంసించినది. భగవానుడు

శ్లో॥ పశ్యత్యచక్షుః సశృణోత్యకర్ణః
అపాణిపాదో జవనో గృహీతా॥

చెవులు లేనట్లుండియు, వినువాడు కనులు లేనట్లుండియు చూచువాడు చేతులు లేనట్లున్నను తీసుకొనువాడు, కాళ్ళు లేనట్లున్నను నడుచువాడు అనగా ఇంద్రియములు లేకయే ఆ పనులు చేయువాడు ఇంద్రియములను తన స్వాధీనములో నుంచుకొనువాడని అర్థము అందులకే సహస్రనామములలో హృషీక + ఈశః = ఇంద్రియములకు ప్రభువు, లేక నియామకుడు లేక ఇంద్రియములకు గోచరము కానివాడు అని చెప్పిరి

శ్లో॥ దుష్ప్రగ్రహాణ వ సహేష్యన్యైరింద్రియైరపి దుర్గ్రహైః

ఇంద్రియములచేతగాని మనస్సుచేతగాని కూడ గ్రహింపశక్యము కానివాడు కావుననే నీవు జితేంద్రియుడవు, అహల్యాయై జారస్సురపతిః.... ఇత్యాదులచే ఇంద్రాదులు గొప్పగొప్ప అధికారములలోనున్నను ఇంద్రియలోలురైరి. కాని నీవుమాత్రమే జితేంద్రియుడవు ఉత్తమ ధార్మికశ్చ — ఉత్తమమైన ధర్మబుద్ధి కలవాడవు తనను ఆశ్రయించిన వారినైనను ధర్మసూక్ష్మలను బట్టియే రక్షించువాడ ఏపనియైనను తనకొరకు మాత్రము చేసికొనినవాడు అధముడు. తనతోబాటు ఇతరులకుగూడ చేసినవాడు మధ్యముడు కేవలము ఇతరులకొరకే చేసినవాడు ఉత్తముడు అట్లు ఇతరుల కొరకే చేసిన వాడవుగాన నీవే ఉత్తమ ధార్మికుడవు "వర్ణాశ్రమ ధర్మములను సక్రమముగా నడిపించినవాడు ఉత్తమ ధార్మికుడు శరణాగత రక్షకుడు ఉత్తమ ధార్మికుడు

పరమాత్మను పొందుటకు ఆచార్యుడే (గురువు) మార్గము-అని చెప్పిన వాడే ఉత్తముడు "ఆనృశంస్యం పరోధర్మః" అని అట్టి కరుణ కలిగినవాడే ఉత్తముడు ఆపదలయందు మిత్రులకు నేనున్నానని భయము లేదని చెప్పువాడే ఉత్తమ ధార్మికుడు. దోషులకు శిక్షవిధించి వారి పాపములను పోగొట్టి స్వర్గమునకు పంపుటయే ఉత్తమ ధర్మము. ఈ లక్షణములన్నియు నీలో గలవు. కావున నీవే ఉత్తమ ధార్మికుడవు

అక్షయ్య కీర్తిశ్చ — నిందింపదగని, నాశనముకాని కీర్తి గల వాడవు. "తస్య నామ మహద్యశః" అతని పేరే గొప్పకీర్తి. వాలి వధనుబట్టి దూషింపదగని కీర్తి గలవాడెట్లగును! అనగా క్రూరములై ఇతరులను బాధించు మృగములను వేటరూపముగా చంపినను, వేటయందు పశాద్భాఖ వధ దోషము కాకుండుట చేతను, సార్వభౌములు తిర్యక్కులతో ఎదురునిల్చి పోరాడకూడదను నియమముండుట చేతను, దోషులను శిక్షింపకుండిన ఆదోషిపాపము తనకంటుకొనునను శాస్త్రము చేతను వాలి వధ దూష్యముకాదు. అందుచే అది కీర్తికరమే గాని అపకీర్తిగాదు, "యశసశ్చైక భాజనం" కీర్తికి నీవే స్థానమైనవాడవు గాన అక్షయ్య కీర్తివంతుడవు నీవే —

విచక్షణశ్చ — దూరదృష్టితో కార్యము లు నెరవేర్చువాడు - పరమాత్మ ఏది ఎట్లు ఏ రూపముతో చేయవలయునో ఆలోచించి దుష్ట శిక్షణకై ఆయా అవతారములనుదాల్చి కార్యము నెరవేర్చును. మత్స్యాద్యవతారములన్నియు

విచక్షణా దక్షత కు ప్రతిరూపము లేగదా! నరులచేత నే చావు గలదుగాన రావణుని చంపుటకు మానవుడవై తివి. వాలి, సుగ్రీవుల మొదటియుద్ధములో బాణ ప్రయోగము చే సుగ్రీవుడే చనిపోవునేమోయని ఆలోచించి అతనిని గుర్తించుటకై పుష్పమాల ధరింపచేయుట ఆచార్య కటాక్షము లేనిచో పరమాత్మ కటాక్షము కలుగునవకాశము లేదని సుగ్రీవుకు లక్ష్మణుని ఆశ్రయించునట్లు చేసి ఆచార్య కటాక్షము కలిగించుటయు ప్రత్యక్షము, కావున నీవే విచక్షుడవు.

క్షితి క్షమావాన్ — నీవే భూమియంత ఓర్పుగలవాడవు. తన ఆశ్రితుల విషయమునగాని, భక్తుల విషయమునగాని అపరాధము చేసిన వారిని సబాంధవముగా నాశనము చేయవలసియున్నను, వారిని క్షమించుటయు, ఏబదికోట్ల యోజనములు విస్తీర్ణముగల భూమికి యున్న ఓర్పునీకే యుండుట విశేషము కారణమేమి? ఆభూమిని దనగర్భమునందే ధరించినవాడవుగదా! హిరణ్యాకశిపునిజంపి వాని బంధువులను వాలిని చంపి వాని ఆత్మీయులను కాపాడుట నీక్షమకు స్థానములు అట్టి క్షమావంతుడవు నీవేగదా!

క్షతజోపమాక్షః :- ఎర్రని కన్నులు గలవాడు "త్రితామ్రః" మూడు ప్రదేశములందెరుపుగలుగుట సార్వభౌమ లక్షణము "రక్తాస్య నేత్రపాణిః" ముఖము, కనులు, అరచేతులు ఎరుపుగానుండవలెను అది మహాపురుషత్వ సూచకము

"రామో రక్తాంతలోచనః" అను దానిని ఇట్టి పుండరీకాక్షత్వ సూచనచే నీవే ఆ పుండరీకాక్షుడవు

మనుష్యదేహము విడిచి దివ్యదేహముతో నుండువాడు "అనుటచే తనంతటను ప్రకాశింపనేగును దేహముతో అనేక విధములుగా అవతరింపగలడని భావము.

శ్లో॥ మనుష్యదేహాభ్యుదయం విహాయ
దివ్యేన దేహాభ్యుదయేన యుక్తః

తార పలికిన యీ పై వాక్యములలో పరమాత్మయే శ్రీరాముడని స్పష్టమగుచున్నది.

ఓ రామా! నీవు అప్రమేయుడవు దురాసదుడవు జితేంద్రియుడవు ఉత్తమ ధార్మికుడవు అక్షయ్య కీర్తిగల వాడవు విచక్షణుడవు క్షితిక్షమావంతుడవు క్షతజోపమాక్షుడవు ధర్మము, కీర్తి, ఓర్పు గలవాడవు మహాబలశాలివై శరచాపంబుల ధరించినవాడవు" ఇట్లు స్తుతించుచునే పలవ పరిత్రుతిగాబడి" రామా! ఏ బాణముతో వాలిని చంపితివో అట్టి బాణముతోనే నన్ను కూడా వధింపుము, నేనును ఆతని వద్దకే పోయెదను. నేను లేనిదే వాలి సుఖపడలేదు భార్యా వియోగమువలన కలుగుబాధ నీవెరగనది కాదు.

రామా! భార్యను భర్తతో చేర్చుటవలన నీకు స్త్రీహత్యాదోషమురాదు "అర్ధో హ్యేష ఆత్మనః యత్పత్నీ"

అనగా తన ఆత్మలో భార్య సంగోరు భాగము. "ఆత్మా హిదారాః" ఆత్మయే భార్య" ఇట్లు వేదశాస్త్రములలో చెప్పియుండుటవలన పురుషునికి భార్య భిన్నముగాక ఆత్మయే అయి యున్నందున, నేను వాలిక ఆత్మను గావున, నన్ను చంపినను నీకు స్త్రీ హత్యాదోషమురాదు. లోకములో భార్యను భర్తతో చేర్చుటకంటె గొప్పదానము లేదని జ్ఞానులాదురు అంతేగాదు, ఈ భార్యాదానముచేసి నన్ను నా ప్రియునివద్దకు చేర్చినచో నా భర్తను చంపిన పాపముగూడ నీకంటదు" అని పలికెను.

భా॥సం ఇచట తారయొక్క శాస్త్రజ్ఞానముగూడ గుర్తింపవలెను "తననుచంపి వాలి వద్దకు పంపుటలో రామునకు పాపముగాని, దోషముగాని, అంటవు" అను శాస్త్రోక్తి విషయములు చెప్పుట, ఆమె శాస్త్రజ్ఞానమునకు నిదర్శనము "అర్థోవా ఏష ఆత్మనః యత్ పత్నీ" ఆత్మాహిదారాః" ఇత్యాది ధర్మసూత్రములు చెప్పుటచే ధర్మము, రాజనీతి, శాస్త్రము, మొదలగునవి బాగుగా ఎరిగినదని తెలియుచున్నది.

తార మాటలువిని రాముడామెతో "వీరపత్నివగునో తారా! వాలి మరణమునకు విచారింపకుము. శూరుని భార్య విచారింపదు సుమా! సుఖదుఃఖములు బ్రహ్మచే సృష్టింపబడినవి. వానినెవ్వరును అతిక్రమింపలేరు. నీవింక సుఖములే అనుభవింపబోవుచున్నావు. నీ కుమారుడు యువరాజు కాగ

లడు" అనెను. ఆమాటలకు తార ఊరడిల్లి సంతోషమును సూచించు ముఖముకలదై దుఃఖమును వీడెను.

అంత రాముడు అంగదునితో "మీరు ఇట్లు ఎంత యేడ్చినను ప్రయోజనము లేదు జీవులు ఆయా కర్మములు అనుభవించుటకు సర్వేశ్వరుడే కారణము. వాలినా బాణముచే మృతుడై స్వర్గమునకు పోయెను ఇపుడు చేయవలసిన కార్యము చేయుడు" అని పలికెను లక్ష్మణుడు సుగ్రీవునితో "సుగ్రీవా! తారాంగదాదులతో గూడి వాలికి యుత్తరక్రియ లొనర్పుము అంగదుని సమాధానపరచి చందనము వస్త్రములు మొదలగు వానిని తెప్పింపుము" అని పలుకగా సుగ్రీవుడు పల్లకీ తెప్పించి వాలిని ఉంచి మహారాజులనువలె శ్మశానమునకు తీసుకొనిపోయి శాస్త్రోక్త ప్రకారము వాలిని దహనపరచి తర్పణాదులను గావింపజేసెను శ్రీరాముడును సుగ్రీవాదులతో సమానమైన దుఃఖముతోడనే వాలికి సంస్కారము లన్నియు యథావిధిగా చేయించెను.

కర్మలన్నియు పూర్తి కాగా సుగ్రీవుడు రాముని యొద్దకువచ్చెను అపుడాంజనేయుడు, "రామా! నీదయవలన సుగ్రీవుడు రాజ్యమును పొందగలిగెను నీవు కిష్కింధకు వచ్చి అతనిని రాజుగాచేయుము నీ వాజ్ఞాపించిన యెడల సకల రాజకార్యములను చేయగలడు "అని పలుకగా రాముడు" ఆంజనేయా! పితృవాక్య పరిపాలనా ప్రకారము నేను పదునాల్గు సంవత్సరములు గ్రామమునకుగాని పట్టణమునకుగాని రాను. మీరే శాస్త్రోక్తముగా సుగ్రీవునకు అభిషేకము

గావింపుము. సుగ్రీవా! అంగదునకు యువరాజ పట్టాభిషేకము గావింపుము. ఈతడు పరాక్రమమున నీతో సమానుడు. ఈ వర్షాకాలము నాలుగు నెలలు సీతను వెదుకనవకాశముండదు. కార్తీకము రాగానే ఆపని చేయవచ్చును. కిష్కింధకేగి పట్టాభిషేకము చేసికొనుము" అని పలుకగా వానరు లెల్లరు సుగ్రీవునకు నమస్కరించిరి సుగ్రీవుడు వానరులను లేవదీసి గౌరవించెను.

అనంతరము సుగ్రీవుడు చక్కగా అలంకరింపబడి అన్నగారి అంతఃపురములో ప్రవేశించెను.

(తారను గౌరవించుటకని పెద్దల అభిప్రాయము)

శ్లో|| భ్రాతురంతఃపురం సౌమ్యం ప్రవివేశ మహాబలః
ప్రవిశ్యత్వభినిష్క్రాంతం సుగ్రీవం ప్లవగేశ్వరం

"సుగ్రీవుడు అన్నగారి అంతఃపురములో ప్రవేశించి తిరిగి వచ్చినాడు" అనిమాత్రమే యున్నది కాని అచట ఏమిచేసినది. ఎందుకు వెళ్ళినది. "వివరణలేదు వాలి మరణముచే విచారించుచున్న తారను ఓదార్చి ఆమె అనుజ్ఞ తీసుకొని అంగదునకు యువరాజు పట్టాభిషేకము చేయుదునని యు ఆమెకు చెప్పియుండవచ్చునని పెద్దల అభిప్రాయము అంగదుడు జ్యేష్ఠుడు, కాక నీతో సమానుడు సుమా! వాలిపై కోపమున నీవాతనిని ఉపేక్షించిన సర్వజ్ఞురాలైన తార నుండి నీవు దూరమగుటయేగాక బలవంతుడగు మహాక ప్రత్యర్థి నీకెదురగును సుమా! అందుచే అంగదునకే యువరాజ

పట్టాభిషేకము గావింపవలెనని శ్రీరాముడు, తార, సుగ్రీ వాంగదులను వేరుకాకుండగానుండుటకై ఏర్పరచెను.

ఆ విషయము తారకు చెప్పుట అవసరము. ఆమెను ప్రసన్నురాలిని చేసుకొనుటయు అవసరమే కావున అతడంతఃపు రములో తారతో మాట్లాడుటకే వెళ్లి యుండునని అభిప్రాయ పడవచ్చును.

సుగ్రీవుడు తిరిగి ఆస్థానమండపమునకు రాగా వానరులాతనిని సింహాసనముపై కూర్చుండ చేసి, తెల్లని గొడుగుపట్టి, తెల్లని చామరములతో వీచుచు, సకల ఓషధులతో గూడిన సముద్ర నదీ, నదజలములను బంగారు కలశములతో దెచ్చి హనుమంతుడు జాంబవంతుడు మొదలగు వారు అష్టవసువులు ఇంద్రుని అభిషేకించినట్లు అభిషేకము చేసిరి. వానరులెల్లగును సంతసించిరి శ్రీరాముని ఆజ్ఞ ప్రకారము సుగ్రీవుడు అంగదుని కౌగిలించుకొని యువరాజ పట్టాభిషేకమునుగావించెను. అందులకు వానరులెల్లరు సుగ్రీవుని పొగడి రామలక్ష్మణులను స్తోత్రముచేసిరి సుగ్రీవుడు భార్యయగు "రుమ"తో సమస్త సౌఖ్యములననుభవించుచు వానర రాజ్యమును పాలించుచుండెను శ్రీ రాముడు తమ్మునితో గూడ ప్రస్రవణ పర్వతముపై నివసించెను

వర్షాకాలము ప్రారంభమయ్యెను. ఆకాశమంతయు మేఘావృతమయ్యెను మేఘములు సముద్ర జలమును ఆకర్షించుకొని కార్తీకమునుండి ఆషాడము వరకు తమయందు ఉంచుకొని మక్కిలి బరువై "గర్భముధరించి ప్రసవించుచున్న

స్త్రీలవలె" వర్షమును కురియుచున్నవి. మేఘములు వ్యాపించుటచే దిక్కులు తెలియుటలేదు. ఉరుములకు నెమళ్లు నాట్యముచేయుచున్నవి. ప్రియురాండ్రనెడబాసిన పురుషులు విచారించుచున్నారు. కదంబాది వృక్షములు పూచినవి. సస్యగర్భితోనున్న నేలయంతయు ఎఱ్ఱని ఆర్ద్ర పురుగులచే నిండి పచ్చని పట్టుచీరపై ఎఱ్ఱని జరీపూలు కుట్టి నట్లున్నది. వర్షాగమము తెల్లగనుండె సంభోగాసక్తరాండ్రి యగు స్వర్గస్త్రీల మెడలనుండి జారిన ముత్యాల హారములవలె నున్నవి "సంధ్య" అనెడు "స్త్రీ" "చంద్రుడు" అనెడు ప్రియుని కరస్పర్శచే పులకించి" నక్షత్రములు" నెడుకనులు విహ్వలై జారిపోయె స్వయముగనే అంబరమును విడుచుచున్నది

భా॥సం॥ ఇచట నిజముగా స్త్రీపురుషులు లేరు. కాని నూతన ప్రియా సమాగమమును చక్కగా వర్ణించినాడు. సాయంకాలము చంద్రోదయమగుటయు నక్షత్రములు మినుకు మినుకుమని కనబడుచుండుటయు, సంధ్యాకాలముపోయి రాత్రియగుటయు సాధారణము - ఈ "సంధ్య"యే ఒక నూతన వధువు చంద్రుడు వరుడు చంద్రకిరణములు వ్యాపించెను. "సంధ్య" రాగవతి అనగా ఎరుపు గలదియు, అనురాగము గలదియు, అని అర్థము. చంద్రకిరణములు అనగా కిరణములు ప్రియుని చేతులు అంబరము, అనగా ఆకాశము-వస్త్రము- సంధ్యాకాలము వెళ్ళిపోవుచుండగా చంద్రుడుదయించెననియు నక్షత్రములు పొడసూపెననియు భావము ప్రియుని కర

స్పర్శచే, కమలము న్మీలితముగా చేసికొని అనురాగవతియగు సంధ్యావధువు స్వయముగనే వస్త్రమును జారవిడుచుచున్నది. అనిర్వాని సంధ్యాకాలము దాటుచుండగా చంద్రోదయమును నక్షత్రకాంతినిచూచి వాల్మీకి వర్ణించిన యీ విధము ఇంక ఏకావ్యమందునను లేదేమో

వర్షఋతువులో సంధ్యాకాలమున సూర్యుని ఆవరించి యున్న మేఘముల చివరిభాగములు ఎరుపు, మధ్యభాగములు నలుపుగలిగి యుండుటచే ఆకాశమునకు వ్రణము కాగా రక్తము కారుచుండ తెల్లని గుడ్డలతో కట్టుకట్టినట్లున్నది. శస్త్రచికిత్స చేసినపుడు కట్టినకట్టుకు చుట్టును ఎరుపు మధ్య నలుపు ఉండుట సహజముకదా! వర్షముచే దుమ్ముఅణిగి పోయినది. గాలి చలగ వీచుచున్నది. తాపము శాంతించినది. దండయాత్రలు నిలచినవి. దేశాంతరమునకేగిన ప్రజలు స్వదేశమునకు చేరిరి

**భా॥సం–** ఈ వర్ణనలో భగవత్ కటాక్షమును వర్షమువలన జీవునకు రజస్తమోగుణములు నశించుట, దయార్ద్రహృదయుడగుట, సంసారిగనున్నను తాపత్రయములు నశించుట ప్రకృతి సంబంధము వీడుటయును సూచితము

రజస్తమోగుణములు – రజస్సు ఎరుపు, తమస్సు నలుపు, సత్వము –ఆకాశము – తెలుపు తెల్లని ఆకాశమున (సత్వ గుణమున) రజస్సు – రజోగుణము – పరాగము – వ్యాపించినది. వ్రణము చుట్టునున్న యెరుపు – అనురజము

మధ్యనలుపు తమోగుణము. ఈ రెంగు సత్వమున ప్రవేశింప (ఆకాశమున భగవత్కటాక్ష వృష్టి పడిన తరువాత) తెల్లని ఆకాశము (సత్వము) స్థిరమగును – అట్టిచేతను డె (జీవుడే) పరమపదమును పొందగలడు.

అంత శరత్కాలము రాగా ఆకాశమంతయు నిర్మల మయ్యెను. నదులలో నీరు తగ్గి అక్కడక్కడ యేండి ఇసుక దిబ్బలు కనపడుటచే, నవసంగమ ప్రీజ న్వితి వధూజఘనముల వలె కనుపట్టుచుండెను. సప్తచ్ఛదముల పుష్పవాసనచే ఏనుగులకు మదము విజృంభించెను. సరస్సులు నిర్మలము గ నుండుటచే హంసలు స్వేచ్ఛగా క్రీడించుచుండెను యుద్ధ యాత్రకు సమయమాసన్నమయ్యెను.

ఆ సమయమున కాంతాలోలుడై రాజకార్యములను గూడ మరచియున్న సుగ్రీవునిగాంచి ఆంజనేయుడు "వానర రాజా! శ్రీరాముని ప్రతిజ్ఞా నిర్వహణముచే నీవు రాజ్యశ్రీని భార్యను కూడ పొందినావు నీ మాట ప్రకారము మిత్రుని కార్యము నెరవేర్చుట న్యాయము శరత్కాలము వచ్చినది. ఆలసింపకుము ఎవడు కాలమునెరిగి అనేకమంది మిత్రులను సంపాదించుకొని సాధువుగనుండునో వాని రాజ్యము, కీర్తి, ప్రతాపముగూడ వృద్ధిపొందును, తాను సుఖపడును. మిత్ర కార్యము నెరవేర్పనివాడు ఆపదలు పొందును కాలాతి క్రమణము జరుగరాదు. నీకులము నిలిపిన వాడు శ్రీరాముడు ఆతడు అప్రమేయ ప్రభావము గలవాడు ఆతడు చెప్పకముందే

అతని పని చేయుట ధర్మము. ఉపకారము చేసినవానికి ప్రత్యుపకారము చేయుమని నేను నీకు చెప్పవలయునా! కావున వానరులను పిలిపించి సీతాన్వేషణము గావింపుము." అని పలికెను.

భా॥ సం- ఆంజనేయుడు శ్రీరామ భక్తుడు భగవంతుడగు రామునివలననే ఆచార్య స్థానమును పొందినవాడు. జీవులను భగవదభిముఖులనుగా చేయ సమర్థుడు. సాధారణముగా జీవులు భగవత్కటాక్షముచే పొందిన ఐశ్వర్యాదులచే సంసారమున బడి భగవంతుని మరచియుండ వారికి జ్ఞానోపదేశము చేసి మరల భగవదభిముఖులుగా చేయుట ఆచార్య కృత్యము. ఇచట ఆంజనేయుడు సుగ్రీవునకు శ్రీరామునిగూర్చి "అప్రమేయ ప్రభావుడు" (ఇంతయని కొలతలేని ప్రభావము గలవాడు) అని బోధించుచు రామాభిముఖునిగా చేయుట ఆచార్యకృత్యము. అంతేగాక ప్రభువు సరియైన మార్గములో ప్రవర్తింపనపుడు మంత్రులు వానిని సరిదిద్దుట, రాజనీతి ధర్మము. అందువలన బలవద్విరోధము రారాదు. అందులకే కామాసక్తుడై కృతఘ్నుడు కాబోవుచున్న తన ఏలికయగు సుగ్రీవునకు తాను మంత్రిగా చెప్పవలసినది చెప్పి సరియగు మార్గములో నుండుటకు ప్రయత్నించెను. రాజభక్తి రాజనీతికి ఆంజనేయుని మాటలు రత్నపు గుళికలు.

హనుమంతుని మాటలు విసిన సుగ్రీవుడు "ఆంజనేయా! నీవే వెంటనే సేనాపతులను కూర్చుకొని ఎక్కడెక్కడున్న

వానరులను పదునైదుదినములలో రమ్మని నాయాజ్ఞగా చెప్పుము అట్లు రానివానికి మరణమే దండము అనిచెప్పుము అని పలికి మరల అంతఃపురమునకు వెడలిపోయెను.

ప్రశ్రవణ పర్వతముపైనున్న రాముడు శరత్కాలము వచ్చినను సుగ్రీవుడు సీతాన్వేషణ ప్రయత్నము చేసినట్లు కనపడునందున లక్ష్మణుని పిలిచి "సౌమిత్రీ! రాజ్యసుఖములలో మునిగిన సుగ్రీవుడు వర్షకాలము దాటినను ఇంకను సీతాన్వేషణ ప్రయత్నము చేయలేదు.

శ్లో॥ అర్థినాముపపన్నానాం పూర్వంచాప్యుపకారిణాం
ఆశాంసశ్రుత్యయోహంతి సలోకేపురుషాధమః॥

శ్లో॥ శుభం వాయదివాపాపం యోహివాక్య ముదీరితం
సత్యేన పరిగృహ్ణాతి సవీరఃపురుషోత్తమః॥

శ్లో॥ కృతార్థాహ్యకృతార్థానాం మిత్రాణాం నభవంతియే
తాన్మృతానపిక్రవ్యాదాః కృతఘ్నాన్నోపభుంజతే॥

ఒక పనికొరకై యొకరిని ఆశ్రయించి పూర్వము ఉపకారము చేయగా అతడు వానికి ప్రత్యుపకారము చేయుదునని చెప్పి ఎవడు చేయడో వాడు అధముడు మంచిదైనను చెడ్డదైనను, ఎవడు తాను అన్నమాటను నిలబెట్టుకొనునో అట్టి వీరుడే పురుషశ్రేష్ఠుడు. ఒకరి వలన ఉపకారముపొంది తిరిగి వారికి ఉపకారము చేయని కృతఘ్నుడు చనిపోయినను వాని శవమును మాంసము తినువారుకూడ ముట్టుకొనరు. సుగ్రీవుడు రాజ్యమును, భార్యను కూడఁబొంది సుఖములను

అనభవించుచు పూర్వోక్త కార్యములను మరచినాడు, నా పరాక్రమెఱిగినవాడు నాధనుశ్శబ్దము వినదలచినాడేమో, కావున నీవేగి నామాటగా నిట్లుచెప్పుము.

శ్లో॥ నచసంకుచితః పంథాయేన వాలీహతోగతః
సమయేతిష్ఠ సుగ్రీవ! మావాలిపథ మన్వగాః॥

శ్లో॥ ఏకఏవరణేవాలీ శరేణ నిహతోమయా,
త్వాంతు సత్యాదతిక్రాంతం హనిష్యామి సబాంధవం॥

సుగ్రీవా! వాలి హతుడై పోయిన మార్గము, ఇంకను మూతపడిపో లేదు. నీవా మార్గమునను సరించి మన సంకేతము ను మరువకుము. ఒక బాణముచే వాలియొక్కడే చంపబడెను సత్యము వీడిన నిన్ను సబాంధవముగా చంపెదను”

భా॥సం॥ శ్రీరాముడు జితక్రోధుడుగదా! యిట్లు పలుక తగునా అనవసరము లేదు అతని కోపము కేవలము కృతఘ్నులపైననేగాని యితరులపై అనవసరముగా చూపడు కాక “క్రోధము” ఆయన అధీనములోనున్నదిగాని, ఆయన క్రోధమునకు వశముగాడు. అదియు బలవంతముగా కొన్ని పరిస్థితులలో తెచ్చుకొనునట “క్రోధమాహారయత్ తీవ్రం “కోపమును తెచ్చుకొనెను” అని వాల్మికి రాముని గూర్చి పలికెను. సుగ్రీవుడు కృతఘ్నుడు కాగాదను దృష్టితో పలికిన మాటలేగాని అన్యములుగావు ముందా విషయము తెలియును.

రాముడిట్లు పలుకగా లక్ష్మణునకు కోపమువచ్చి

"ఇప్పుడేపోయి ఆకృతఘ్నుని సంహరించెదరు" అని పలుక రాముడాతనిని సమాధానపరచి" మిత్రుని చంపుట మహాపాపము. విచక్షణాజ్ఞానముతో ఆతడు కృతఘ్నుడు కాకుండ నట్లును మన కార్యము నెరవేరునట్లును చేయవలెను" పూర్వస్నేహితుడవు ఆతనిని మంచిమాటలతోనే పలకరింపుము. ఆప్తుని చూచుకొందుము" అని పలుక లక్ష్మణుడు మిక్కిలి కోపముతో శీఘ్రముగ కిష్కింధకేతెంచెను. ఆతనిని చూచిన వానరులు భయపడి పరుగెత్తుకొనిపోయి సుగ్రీవునకు చెప్పిరి. కాని ఆతను మత్తులో వీరిమాటలు వినిపించుకొనలేదు అంగదుడు దీనుడై లక్ష్మణుని సమీపింపగా సౌమిత్రి "అంగదా! అన్నగారి వ్యసనముచే తపించిపోవుచున్న లక్ష్మణుడు ద్వారమువద్దనున్నాడు. ఆతని మాటలు వినదలచిన వెంటనే అతనిని లోనికి పిలిపించుకొనుము," "అని నామాటలుగా సుగ్రీవునితో చెప్పుము" అని పలుకగా అంగదుడు భయపడి ఒక్క అంగలో సుగ్రీవుని వద్దకు వచ్చి ఆతని పాదములు పట్టుకొని లక్ష్మణుని మాటలు వినిపించెను.

అంతలో "ప్లక్షుడు" "ప్రభావుడు" ఆంజనేయుడు" అను మంత్రులు వచ్చి అంగదుడు చెప్పిన దానినే మరల చెప్పగా సుగ్రీవుడు శాంతపొంది "లక్ష్మణుడుకోపము తెచ్చుకొనుటకు కారణమేమి? వారికి నేనేమియు అపకారము చేయలేదే? నా విరోధులెవరైన నామీద వారికి కోపము తెప్పించిరేమో! స్నేహము సంపాదించుట సులభము కాని దానిని నిలబెట్టుకొనుట కష్టము మహాత్ముడగు రాముడు

చేసిన దానికి ప్రత్యుపకారము చేయకుండటచే భయపడు చున్నాను” అనగా ఆంజనేయుడిట్లనెను.

రాజా! రాముడు చేసిన ఉపకారము మరచినందున లక్ష్మణుడిట్లు (వచ్చు) చేయుటలో ఆశ్చర్యము లేదు. రాముడే పంపియుండవచ్చును ఆతడు నీకొరకై వాలినిచంపి కిష్కింధా రాజ్యము నీకిచ్చెను కాని నీవు మైకము చే కార్యమును మరచితివి. అందుచే కోపము కలిగియుండును. శరత్కాలము వచ్చినది కాని నీవు సీతాన్వేషణ ప్రయత్నము చేయలేదు ఇక ఆలసింపక చేతులు జోడించుకొని ముందు లక్ష్మణుని ప్రసన్నుని చేసికొనుము. రాజులు అడిగినపుడు మంత్రులు నిర్భయముగ హితము నే పలుకవలయును గావున చెప్పు చున్నాను. శ్రీరాముడు తలంచుకొనిన సురాసురగంధర్వాది లోకముల నన్నిటిని స్వాధీనము చేసికొనిగలడు కావున శిరస్సువంచి రామునకు నమస్కరించి నీవిచ్చినమాటలు నిలబెట్టుకొని ఆతని ఆధీనములోనుండుము, నారాయణుని కాంతివంటి కాంతిగల రామునిలోనున్న మానవబలమును మాత్రమే చూచితివి. దివ్యాస్త్రబలమును చూడలేదు “అంతవరకు రాకుండక నే తొందరగా రాముని శరణు వేడుము” అనిపల్కెను.

భా॥సం. జీవులు భయములో పరమాత్మనెట్లు చేరుటయో ఎరుంగక సందేహించుచున్నపుడు వారి భయముతీర్చివారు పరమాత్మనెట్లు చేరవలెనో ఆ పరమాత్మ యెట్టివాడో తెలుపుట ఆచార్యకృత్యము ఇచట, సుగ్రీవుడు రాముని వలన

భయపడుచుండగా, ఆంజనేయుడాభయమును పోగొట్టి శ్రీరాముని సృష్టి, స్థితి, లయకార కర్త్వమును సూచించెను. "అతడు నారాయణునివంటి కాంతిగలవాడు "అనగా నారాయణుడు సమస్త చేత నాచేతనములకు స్థానమగుట, వాని యందుండి వానిని పోషించుట. అవసానమున తనలో లయము చేసుకొనుట మొదలగు గుణములన్నియు కలవాడని తెలియచేయుటకే అంతేగాక "దివ్యాస్త్ర బలసంపన్నుడు" అనుటలో ఆయుస్త్రములచే సురాసురాదులను జయించినను, వాని కోడనే నిన్ను రక్షింపగలడనుమా! కావున భయముపీడుము శిరసా నమస్కరింపుము అనగా అనన్య రక్షకునిగా శరణాగతి చేయుము. అని సూచింపబడెను. బాహ్యముగా అంజనేయుని మంత్రిత్వలక్షణము రాజభక్తి, నిర్భయత్వము, స్పష్టమగుచున్నది.

వెంటనే సుగ్రీవుడు అంగదుని పంపెను ఆతడు వెళ్లి లక్ష్మణుని తోడ్కొని వచ్చుచుండగా క్రోవలో లక్ష్మణుడు అందమైన గృహములను, పూలతోటలను చూచెను. స్త్రీల పాటలను, అందెలరవళియువిని సిగ్గుపడి మరల కోపముతో ధనుష్టంకారముచేసెను. స్త్రీలకు దూరముగా నిలబడెను. ఆధ్వని విని సుగ్రీవుడు భయపడి తారతో "తారా లక్ష్మణుని చూచుటకు నాకు మిక్కిలి భయముగానున్నది. మహాత్ములు స్త్రీల యెడల కోపముచూపరు. కావున ముందు నీవువెళ్లి అతని కోపమును శాంతింపచేయుము. పిదప నేను వచ్చెదను" అనెను. తారయు మైకముచే అడుగులు తడబడుచుండగా

ఆభరణములు జారుచుండగా లక్ష్మణుని వద్దకు వచ్చెను. అతి డామెను చూచి, ఉదాసీనుడయ్యెను. అంత తార

శ్లో॥ కింకోపమూలం మను జేంద్రపుత్ర।
కస్తేన సంతిష్ఠతి వాఙ్నదేశే
కశ్శుష్కవృక్షం వనమాపతంతం
దవాగ్నిమాసీదతి నిర్విశంకః॥

రాజకుమార! నీ కోపమునకేమి కారణము? నీ ఆజ్ఞను ఎవడు అతిక్రమించగలడు? ఎండిన చెట్లుగల అడవిని దహించుచున్న కార్చిచ్చును, ఎవడు సమీపింపగలడు? అని మృదువుగా పలికెను. మొదట ఆమె రూపమును చూచుటకే అతడు సిగ్గుపడునట్లుండెను "మదవిహ్వలాక్షీ, సలజ్జనా, నమితాంగయష్టిః, ఆమె రూపము: మద్యపానముచే ఎఱ్ఱబడి రెప్పలు వ్రాలిపోవుచున్న కనులగలదట. శరీరము నిండ సంభోగ చిహ్నము కనపడుచున్నవట. వంగిన శరీరముతో నున్నదట. "అయినను అందమయినదట. వానరస్త్రీలుగూడ కామరూపిణులగుటచే ఆమెను (కోతిని) అందమైనదని చెప్పుటలో ఆక్షేపణ యుండదని పెద్దల అభిప్రాయము ఆ వేషముతోనున్న తారను జూచి స్త్రీసమీపించుటచే సిగ్గుపడి కోపమును మల్లించుకొని మహాత్ముడగు లక్ష్మణుడు ఉదాసీనుడై తలవంచుకొనియే ఆమె మాటలకు జవాబు చెప్పెను.

శ్లో॥ కిమయం కామ వృత్తస్తేలుప్త ధర్మార్థ సంగ్రహః
భర్తా, భర్తృహితే! యుక్తే, నచైనమవబుధ్యసే।

భర్తకు హితము చేయుటలో ఆసక్తి గలదానా! నీ భర్త ధర్మార్థములను విడిచి కేవలము కామపరంతతుడై యున్నాడు. ఆ విషయమును నీవు గ్రహించియుండలేదా!

భా॥సం॥ ఇచట తారపాత్రి చాలా జాగ్రత్తగా పరిశీలింప వలెను. లక్ష్మణుడు తారను సంబోధించుచు "భర్తృహితే తే భర్తా" అన్నాడు అనగా సుగ్రీవుడు తారకు భర్త అన్నట్లు స్పష్టమగుచున్నది వాలి సుగ్రీవుని భార్యను అపహరించినపుడు దోషము అయినదిగదా! సుగ్రీవుడు వాలిభార్యను స్వీకరించిన దోషము కాదా!" అను ప్రశ్న వచ్చుచున్నది. రాముడు వాలిని చంపినపుడు ఆ వాలి వేసిన ప్రశ్నలకు సమాధాన మొసగినపుడు శాస్త్ర, శిష్ట లౌకికాచారములను దహరించెను అట్లే యిక్కడగూడ ఆ మూడింటిని గుర్తింప వలెను

శ్లో॥ అస్యత్వంధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః
రుమాయాంవర్తసే కామాల్ స్నుషాయాం పాపకర్మకృత్
తస్యదండో వధః స్మృతః .....

సుగ్రీవుడు బ్రతికియుండగా అతని భార్యను బలాత్కారముగా స్వీకరించినాడు వాలి అందులకు మరణమే దండనము. ఇది శాస్త్రము – ఇప్పుడు వాలి చనిపోయినాడు అంతేగాక వాలియే స్వయముగా" సుగ్రీవుడు తారను అవమానింపకుండ చూచుచు అంగదుని పుత్ర సమానుడగా చూడవలెనని కోరినాడు. కాక తారకు రాజ్య భోగాదులపై

మిక్కిలి ఆశగా నన్నిట్లు ఆమె మాటలవల్ల తెలియుచున్నది శాస్త్రరీత్యా భర్త చనిపోయిన తరువాత ఆమెకు ఇష్టముండిన ఆతని అన్నదమ్ములలో ఎవరినైన స్వీకరింపవచ్చు దేవర న్యాయముగూడ ఆనాడు అమలులో నుండియుండెను. కాని యీనాటికి మనుష్యులలో గూడ కొన్ని చోట్ల కొన్ని జాతులలో మారుమనువుగూడ గలదు. అది ఆయా జాతులవారి ఆచారమై యున్నది. ఆయాజాతులకది దోషముగాదు. అదియు స్త్రీ, పురుషులిరువురును ఇష్టపడినప్పుడును, కులపెద్దలు ఆయా పంచాయితీలు విధించినపుడును జరుగుచుండవచ్చును. ఇందుకు శాస్త్రముగూడ—

శ్లో॥ మృతేచ అంగవైకల్యే రోగగ్రస్తే చ భర్తరి
భర్త్రా త్యక్తా చ యువతీ పునస్సంస్కారమర్హతి॥

"అని చెప్పియుండుటచే భర్త చనిపోయినగాని, అంగ వైకల్యము (నపుంసకుడు) కలవాడుగాని, రోగముతో గూడినవాడుగాని, అయిననూ భర్తచే విడువబడినను, ఆ యువతి మరల వివాహము చేసికొనవచ్చును.)

ఈ ప్రకారము తార సుగ్రీవునకు భార్యయగుటలో దోషము లేదని పెద్దల నిర్ణయము.

శ్రీరామచంద్రుడు చేసిన యుపకారమును మరచి వానర రాజగు నీ భర్త సీతాన్వేషణ కార్యమునే విస్మరించెను ధర్మాధర్మములు విచారింపవలసిన వానికి మధుపానము తగదు.

పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే
ధర్మలోపో మహాన్ స్తావత్కృతే హ్యాప్రతి కుర్వతః

పానము వలన ధర్మార్థకామములు మూడును నశించును. ఉపకారికి ప్రత్యుపకారము చేయకున్నచో ధర్మహాని కలుగును. సత్య ధర్మాసక్తి కలిగిన మిత్రుడు అర్థ కామములకు మూలము అట్టిమిత్రుని విడచిన అర్థకామము లును నశించును ధర్మార్థ కామములకు లోపముగలుగునట్లు మిత్రకార్యము చేయక విడిచినవానిని గూర్చి ఏమిచేయవలెనో కార్యతత్వజ్ఞురాలవైన ఓ తారా! నీవే చెప్పుము" ఇట్లు పలికిన లక్ష్మణుని మాటలకు తార "నరోత్తమా! సుగ్రీవుడు కామా తురుడై శ్రీరామ కార్యమును మరచుట నిజమే వాలిని చంపి రాజ్యమిప్పించిన యుపకారమునకు సీతాన్వేషణము ప్రత్యుపకారము కాని సుగ్రీవుడు మన్మథ బలమునకు వివశు డయ్యెను నీవును క్రోధ పరవశుడవైతివి.

శ్లో॥ కోపం కథం నామగుణ ప్రకృష్టః
కుమార! కుర్యాదకృష్టసత్త్వే
కస్త్వద్విధః కోపవశంహిగచ్ఛేత్
సత్వావరుద్ధః తపసః ప్రసూతి॥

శ్లో॥ జానామి రోషం హరివీర బంధో!
జానామి కార్యస్యచ కాలసగం
తచ్చాపి జానామి యథాఽవిషహ్యం
బలం నరశ్రేష్ఠ! శరీరజస్యం॥

శ్లో॥ న కామతంత్రే తవబుద్ధిరస్తి
త్వంవై యథామన్యువశం ప్రపన్నః
న దేశకాలౌహి నచార్థ ధర్మా
వపేక్షతే కామరతిర్మనుష్యః॥

శ్లో॥ తం కామవృత్తం మమ సన్నికృష్టం
కామాభియోగాచ్చవిముక్తలజ్జం
క్షమస్వ తావత్ పరవీరహంతః
త్వద్భ్రాతరం వానర వంశనాథం॥

కుమారా! సత్త్వగుణము కలిగి శాంతికి ఆకరమై గొప్ప వీర్యముగల నీవంటి రాజపుత్రుడు బలహీనునిమీద కోపించుకొనవచ్చునా! రాముని యొక్క కోపము నెరుగుదును ఆతడు చేసిన దానికి ప్రత్యుపకారము చేయవలెననియు ఎరుగుదును, నరోత్తమా! మన్మథుని యొక్క బలము సైచుటకు (అణుచుటకు) సాధ్యము కాదనియు నేనెరుగుదును నీవు కోపమునకు స్వాధీనుడవగుటచే కామతంత్రములో నీ బుద్ధి చొరలేదు (అనగా కామక్రోధములు రెండును ఒకటేసుమా! ఆతను కామపరవశుడయి నే నీవు క్రోధపరవశుడవైనావు. మీ యిరువురకును భేదమేమి?) నీవెట్లు క్రోధపరవశుడైతివో ఆతడును అట్లే కామపరవశుడయ్యెను కామమునందాసక్తిగలవాడు దేశకాలములను ధర్మాధర్మములను లక్ష్యపెట్టడు గదా! (అట్లే క్రోధవశుడును సుమా) నా సమీపముననుండి కామవృత్తుడై సిగ్గునుగూడ విడిచిన వానర రాజగు సుగ్రీవుడు నీ సోదరునివంటివాడు అట్టివానిని క్షమించుము. ఈ కోతి పుట్టుకతోనే చపలుడుగదా! తపో

ధర్మాసక్తిగల మహార్షులుకూడ అపేక్షచే కామాతురులై స్త్రీ వ్యామోహితులైరి.

శ్లో॥ ప్రసన్నశీలం మద విహ్వాలంచ
భర్తుర్హితం వాక్యమిదంబభాషే॥

అర్థముగల మాటల నిట్లుపలికి తార మరల విలాస ముగను, మదముచే మధురముగను, భర్తకు మేలు కలిగించు వాక్యములనిట్లు పలికెను "సుగ్రీవుడు మీపనికొరకై యే కోట్లకొలది వానరులను రప్పించుచున్నాడు. అంతఃపుర స్త్రీలను చూడరాదను మర్యాదను కాపాడ వెలుపలనే యుంటివి అయినను సత్పురుషులైన మిత్రులు అంతఃపుర స్త్రీలను చూచినను దోషము లేదు రమ్ము.

శ్లో॥ అచ్ఛలం మిత్రభావేన సతాందారావలోకనః॥
అని లక్ష్మణుని తనతో అంతఃపురమునకు తోడ్కొని పోయెను

అచట శ్రేష్ఠమైన బంగారపు ఆసనముపై భార్యయగు రుమతో గూడియున్న సుగ్రీవుని చూడగానే లక్ష్మణునికి కన్ను లెఱ్ఱబడెను. అది చూచి సుగ్రీవుడు భయముతో వణకు చుండెను. స్త్రీలందరును లేచిరి. అపుడు లక్ష్మణుడు "సుగ్రీవా! సత్యసంధుడు, కృతజ్ఞుడు అయిన మిత్రుడు పూజింపబడును. అమిత్రుడే కృతఘ్నుడయిన అట్టిపాపి ఇంకొకడుండడు.

శ్లో॥ శతమశ్వాన్నృ తేహంతి సహస్రంతుగవానృతే
ఆత్మానం స్వజనం హంతి పురుషంపురుషానృతే॥

శ్లో॥ పూర్వం కృతార్థోమిత్రాణాం నతత్ప్రతి కరోతియః
కృతఘ్నస్సర్వభూతానాం సవధ్యః ప్లవగేశ్వర॥

శ్లో॥ బ్రహ్మఘ్నేచ సురాపేచ చోరేభగ్నవ్రతే తథా
నిష్కృతిర్విహితా సద్భిః కృతఘ్నేనాస్తి నిష్కృతిః॥

ఒక గుఱ్ఱము నిత్తునని చెప్పి ఈయనివాడు నూరు గుఱ్ఱములను చంపిన పాపమును ఒక గోవు నిత్తునని చెప్పి యీయనివాడు వేయిగోవులను చంపిన పాపమును. ఒక మనిషి విషయమై అబద్ధమాడినవాడు స్వజనమునుచంపి ఆత్మ హత్య చేసికొనిన వానిపాపమును పొందును మిత్రుని వలన ఉపకారమునుపొంది, తిరిగి ఆమిత్రునికి ఉపకారముచేయని కృతఘ్నునకు మరణమే శిక్ష. బ్రహ్మహత్య, మద్యపానము, దొంగతనము, వ్రతభంగము, చేసినవానికి సత్పురుషులు ప్రాయశ్చిత్తము చెప్పినారు కాని కృతఘ్నునకు మాత్రము నిష్కృతి లేదు. నీ కార్యము నెరవేర్చుకొని మిత్రుడైన శ్రీరాముని కార్యము నెరవేర్చవలసియుండియు కామపర తంత్రుడవై దానిని మరచినావు వాలి పోయిన మార్గము ఇంకను మూతపడలేదు ఆ మార్గమున నీవు పోవలదు". అని పలికెను

వెంటనే తార లేచి "ఓ మహావీరుడా! నీ నోటినుండి యిట్టిమాటలు వెలువడతగునా! శ్రీరాముడు చేసిన యుపకారమును ఈతడు మరువలేదు. అతని దయచేతనే రాజ్యమును,

రుమను నన్నునుగూడ బొందగలిగినాడు.

శ్లో॥ రామప్రసాదాత్ కీర్తించ కపిరాజ్యంచ శాశ్వతం
ప్రాప్తవానిహసుగ్రీవోరుమాం చ పరంతప।

శ్లో॥ సుదుఃఖం శయితఃపూర్వం ప్రాప్యేదం సుఖముత్తమం
ప్రాప్తకాలం నజానీతే విశ్వామిత్రో యథామునిః

శ్లో॥ ఘృతాచ్యాంకిల సంసక్తోదశ వర్షాణి లక్ష్మణ
విశ్వామిత్రోమహాతేజాః కింపునర్యః పృథగ్జనః ॥

సుగ్రీవుడు ఇంతకు ముందు చాలాకాలము దుఃఖముతో పండుకొనియుండి యీ సుఖమునుపొంది విశ్వామిత్రమహర్షి వలె కాలమునుగూడ మరచినాడు విశ్వామిత్రుడు ఘృతాచి (మేనకయని లోకమునప్రసిద్ధి) యందాసక్తుడై పది సంవత్సరములు లోకమునే యెరుగనట్లుండెను సామాన్యుడు, అంగునను చపలబుద్ధిగల మర్కటము అయిన యీ సుగ్రీవుడెంతే! ఈతడు కామ పరతంత్రుడై ఆరాముని మరచుట దోషమే ఆ రామునివలననేగనా కీర్తిని రాజ్యమును, రుమను, నన్నును, గూడ బొందినాడు, అందులకు క్షమింపుము నీవును కోపమునకు వశుడవుగాకుము. కోట్లకొలది వానరులువచ్చి శ్రీరామ కార్యము నెరవేర్తురు. శాంతింపుము”
అనెను.

భా॥సం॥ తార స్వభావము ఆమె రాజనీతి ఎదుటివారిని ఎలా మలచుకొనవలెనో మొదలగు విషయములు పై మాటలలో వ్యక్తమగుచున్నవి ప్రారంభములోనే "నీకెందులకంత కోపము?" నీ మాట ఎవడు అతిక్రమించగలడు? "అనుటతోడనే రామాజ్ఞ నిర్వర్తించుటయే మాయుద్దేశ్యము" అని స్పష్టము. ఇక ఆమె వచ్చినప్పటిరూపము లక్ష్మణునకు సిగ్గును కలిగించుటలో ఆశ్చర్యము లేదు సంభోగ చిహ్నములతో కనబడుటతోడనే యాతడు సిగ్గుపడినాడు. "కుమార!" అను సంబోధనలో" నీవింకా చిన్నవాడివి. ఈ సౌఖ్యాలు నీకేం తెలుసు" అన్న భావం ఉంది "నరోత్తమా! అనుటలో ఉత్తముడవైన నీవే కోపమునకు లొంగిపోయినావే! కోతియగు సుగ్రీవుడెంత? అని ధ్వనిగా బలికి ఆతడు నమ్రుడై యుండుటతో ఎట్లు ఆతనిని లొంగతీయవలెనో చల్లని చీవాట్లవంటి మాటలతో మైమరపించెను "సుగ్రీవుడు కామవశుడు, నీవు క్రోధవశుడవు నీకూ వానికీ భేదమేమి? "ఈ మాటతో నాతడు మరీ చల్లబడిపోయెను మరి తన భర్తకు అనుకూలంగా ఆతనిపై వాత్సల్యము కలుగునట్లుగా" ఆతడు చపలుడైన కోతి అనియు నీకు సోదరునివంటివాడననియు పలుకుటలో ఆమె చాకచక్యము స్పష్టమగుచున్నది. విశ్వామిత్రునే కామపరతంత్రునిగా ఉదహరించుటతో లక్ష్మణుడు తిరిగి జవాబు చెప్పుటకవకాశము లేకుండచేసెను.

సుగ్రీవుడు వెంటనే లేచి పూలదండలు హారములు తీసివైచి వినయముతో చేతులు జోడించి లక్ష్మణా! శ్రీరాముని అనుగ్రహముచే ఈ రాజ్యము నాకువచ్చినది. ఆతని

ధనుష్టంకారమునకు పర్వతములే వణికిపోయినవి. రావణుడు ఒక లెక్కయా? నేను నిమిత్తమాత్రుడనే స్వశక్తిచేతనే రాముడు సీతను పొందగలడు. దాసుడనగు నేను చేసిన అపరాధమును క్షమింపుము" అనెను. ఆ మాటలకు లక్ష్మణుడు సంతసించి "సుగ్రీవా! నీవంటి మిత్రుడు రామునకు దొరకుటవలననే ఆతడు సనాథుడయ్యెను. నీవాతనితో సమానుడవు నీవలననే ఈ పని కావలెను. నీవు వెంటనే బయలుదేరివచ్చి రామునకు సమాధానము చెప్పుము దుఃఖితుడగు రాముని చూచి నేనట్లు పలికితిని క్షమింపుము" అనెను.

భా॥సం. సుగ్రీవునకు మొదట హనుమంతుడును తరువాత లక్ష్మణుడును కూడ శ్రీరామునిగూర్చి ఆతని శక్తిసామర్థ్యములు చెప్పిరి వీరిరువురును ఆచార్య స్థానీయులే భగవత్కటాక్షముచే పొందిన ఐశ్వర్యాదులచే పరమాత్మనే మరచిన జీవుడు ఆచార్య కృపాబోధలవలన తాను చేసిన దోషములకు పశ్చాత్తప్తుడై పరమాత్మను వేడికొనుట సుగ్రీవుని మాటలలో కానవచ్చుచున్నది భగవదాచార్య కటాక్షములచే జీవుడు పరమాత్మ సారూప్యమును పొందుట" నీవాతనితో సమానుడవు" అను లక్ష్మణుని మాటలవలన గ్రహింపనగును. అందుచేతనే ఆభగవత్సమానతచేతనే లక్ష్మణుడును సుగ్రీవుని క్షమింపగోరెను. అందువల్ల లక్ష్మణుని సౌశీల్యముగూడ గోచరించుచున్నది.

అంత సుగ్రీవుడు ఆంజనేయునితో "సర్వదిక్కులయందు గల వానరులు వచ్చునట్లు కబురుచేయుము" అనగా

ఆంజనేయుడు ఆకాశ మార్గమున సేవకులను పంపెను. అదివరకే వార్తలనందియున్న వానరులు ఆక్షణములోనే కానుకలు గొనిరాగా సుగ్రీవుడు వానినందుకొని తృప్తిపడి వారికి సెలవిచ్చి పంపి తార మొదలగు అంతఃపుర స్త్రీలను లోనికి పంపి సేవకులచే బంగారు పల్లకి తెప్పించి లక్ష్మణుని అందుకూర్చుండ చేసి తానును అందు కూర్చుండి ప్రస్రవణ పర్వతమునందున్న శ్రీరాముని వద్దకుబోయి శిరస్సు భూమికి తగులునట్లుగా నమస్కరింపగా రాముడా తని ని లేవదీసి ఆలింగనము చేసికొని కూర్చుండ నియమించెను.

భా॥సం. సుగ్రీవుడు లక్ష్మణ పురస్సరముగా రామునివద్దకు వెళ్లుట," ఆచార్య పురస్సరముగా భగవద్దర్శనమునకు వెళ్లుట సూచించుచున్నది లేకున్న ఇదివరకు ఆచార్యుడగు లక్ష్మణుని ఆశ్రయింపక స్వయముగనే భగవదాశ్రయణము చేయుటచే వాలివలన చావుదెబ్బలు తినవలసివచ్చినది స్వయముగా వెళ్లిన యిప్పుడుకూడ ఏమి ముప్పురాగలదో" అందుననే ఆచార్య పురస్సరముగా వెళ్లెను. అంతేకాదు భగవానుని సమీపించి శిరస్సు భూమికి తగులునట్లు వంచి నమస్కరించుట "సర్వదా, సర్వధా" నీకు దాసుడన"ని తెలియచేయుటకే. అందువలన పరమాత్మకు కరుణ కలిగి తనయందు ప్రపత్తి చేసిన జీవుని తానే స్వయముగ దగ్గరకు చేర్చుకొని, తన సమీపమున కూర్చుండ చేసికొనును ఇచట "శరణం" అను ద్వయ మంత్ర పదార్థముద్యోతకమగును.

సుగ్రీవుడు కూర్చొనగా రాముడు సుగ్రీవా!

శ్లో॥ ధర్మమర్థంచ కామంచ యస్తుకాలేనిషేవతే
విభజ్య సతతంవీర! సరాజా హరిసత్తమ!

శ్లో॥ హిత్వాధర్మంతదాఽర్థంచకామంయస్తునిషేవతే
సవృక్షాగ్రేయథాసుప్తః పతితః ప్రతిబుధ్యతే॥

శ్లో॥ అమిత్రాణాం వధేయుక్తః మిత్రాణాం
సంగ్రహేరతః
త్రివర్గఫలభోక్తాతురాజా ధర్మేణయుజ్యతే॥

ధర్మార్థకామములను ఆయాకాలములలో విభజించుకొని యెవడు అనుభవించునో వాడు నిజమగురాజు ధర్మార్థములను విడచి కామమునే అనుభవించువాడు. చెట్టుచివర కూర్చొని నిదచెందినవానివంటివాడు రాజు శత్రువులను చంపి మిత్రులను చేకూర్చుకొని, వారి కార్యములను గూడ చూడవలెను సీతాన్వేషణము-కును, రావణునితో యుద్ధమునకును సమయమువచ్చినది మంత్రులతో ఆలోచింపుము "అనగా సుగ్రీవుడు చేతులుజోడించి" రామా! మీ సోదరుల యనుగ్రహముచేతనే రాజ్యమును పొందగలిగితిని. ఉపకారమునుపొంది ప్రత్యుపకారము చేయనివాడు అధముడు. నన్ను క్షమింపుము ఈ వానరులందరును దేవగంధర్వాంశలతో పుట్టినవారు మహాబలవంతులు వీరు మన కార్యమును నెరవేర్పగలరు" అనెను అంతలో ఎర్రని ధూళిపై కెగురుచుండ కోట్లకొలది వానరులువచ్చి అంజలించి నిలబడిరి సుగ్రీవుడు వారి వారి సేనాధ్యక్షులను వారి సైన్యముతో నుండ నియమించి పంపి "రామా! ఈసైన్యమంతయు నీయధీనము

నీ వెట్లు చెప్పిన ఆట్లేనడతుగు. ఆజ్ఞాపింపుగా" అని పలుకగా రాముడు సంతో ంచి "సుగ్రీవా! మొదట సీత ఎచ్చటనున్నదో బ్రతికియుండెనో లేదో ఆ మెజాడ గనుగొని రావలెను. సీత క్షేమము, రావణుని నివాస ప్రదేశము ఎరిగినపిదప కాలాను గుణముగా చేయదము" అనెను

అంత సుగ్రీవుడు పనతుడను వానరని పిలిచి "వానరోత్తమా! నీవు నీ సైన్యము తో తూర్పు దిక్కునకు పోయ్యి గంగా, సరయూ, కౌశికీ మొదలగు నదిప్రాంతములును, విదేహ మాళవ, కాశి మొదలగు దేశము లందును, యవ సువర్ణ రూప్యక మొదలగు ద్వీపములయందున్ను, ఇక్షువ ధు. క్షీర, శుద్ధ మొదలగు సముద్ర ప్రాంతము లనందును వెదకుడు ఆ శుద్ధ జలసముద్రమునకవతల బంగారు కొండ ప్రాంతమును చివరఉదయ పర్వతము వరకు వెదకుడు ఆపైన సూర్య కాంతి యుండదు గావున మీరు పోలేరు ఒక నెలదినములలో మీరివన్నియు వెదకిరావలెను. నెల దాటిన మరణమే శిక్ష" ఆని పలికెను

తరువాత అంగదుడు, హనుమంతుడు నీలుడు, జాంబవంతుడు మొదలగు వారిని చూచి మీరు దక్షిణ దిక్కునకు పోవలయును. గోదావరి కృష్ణ వేణి, మొదలగు నదిప్రాంతములును, విదర్భ, ఋషిక, మహిష మొదలగు దేశములను, సహ్య, మలయ మొదలగు పర్వత ప్రాంతములన, చందన ద్వీపమును, మహేంద్ర పర్వతమునందును చూడుడు. ఆ కొండ చరియలనుండియే దక్షిణ సముద్రము అందు నూరు యోజనముల దూరములలో నొక ద్వీపముగలదు. అది

రావణుని నివాసము, అందు వెదకుడు. సముద్రమున ఛాయా గ్రాహికలదు. జాగ్రత్త. అది దాటిన పుష్పితకము, సూర్య వంతము మొదలగు పర్వతములును ఆపైని భోగవతీ పట్టణమును కలవు. అవియన్నియు వెదకి నెలరోజులలో తిరిగి రావలెను" అని పలికెను

పిదప సుషేణునిచూచి "నీవు మరీచి పుత్రులగు మారీచాది వానరులతో గూడి, పడమటి దిక్కునకు పొమ్ము సురాష్ట్ర, బాహ్లీక, శూరసేన మొదలగు దేశములను, పొన్న పనస మొదలగు వృక్షములతో నిండిన వనములను సింధు, హేమ మొదలగు నదీ ప్రాంతములను వెదకుడు పారియాత్ర పర్వతమునందు గంధర్వులున్నారు. వారివంకకు పోకుడు ఆ కొండదాటి వజ్రపర్వతమునందు వెదకుడు అచటలవణసముద్రమున చక్రవంతమను పర్వతమున, విశ్వకర్మచే వేయిఅంచుల గల చక్రము నిర్మించబడినది. దానిని రక్షించు రాక్షసులను పురుషోత్తముడు చంపియా చక్రమును పంచజనుడను రాక్షసుని చంపి పాంచజన్యమను శంఖమును స్వీకరించెను. అచటనుండి వరాహ పర్వతము మీదుగా మేరు పర్వతమును చేరుడు అచట "మేరుసావర్ణి"అను మహర్షికి నమస్కరించి సీత వృత్తాంతము చెప్పి అచటవెదక నెలదినములలో తిరిగి రండు"అని పల్కెను.

అనంతరము "శతవలి" అను వానర వీరుని పిలిచి ఉత్తర దిక్కునకు పంపుచు" నీవువైవస్వత కుమారులతో కలిసి బయలుదేరి. మ్లేచ్ఛ, పుళింద, మొదలగు దేశములను, కాళము, దేవసఖ మొదలగు పర్వత ప్రాంతములను వెదకి కైలాసమునకు వెళ్లుడు. ఆపైని క్రౌంచ పర్వతమునుదాటి,

సిద్ధాశ్రమమును అతిక్రమించి, "శైలోద" నదినిదాటి లవణ గిరి మధ్య సోమగిరియందు వెదకుడు అపైని పోవుటకు మార్గము లేదు గావున నెలదినములలో తిరిగి రండు ఎవరు సీతనుజూచి శ్రీరామునకు సంతోషము కలిగింతురో వాడు నాదయకు పాత్రుడై నాతో సమానముగ భోగములను అనుభవింపగలడు" అని పలికెను వానరులు బీరములు పలుకుచు బయలుదేరిరి

అనంతరము సుగ్రీవుడు ఆంజనేయుని పిలిచి ప్రత్యేక ముగా" వానర వీరా!

శ్లో॥ నభూమౌ నాంతరిక్షేవా నాంబరే నామరాలయే
నాప్సువాగతి సంగంతే పశ్యామి హరిపుంగవ!

శ్లో॥ విదితాస్సర్వలోకాస్తే ససాగరధరాధరాః
గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవంచమహాకపే॥

శ్లో॥ పితుస్తే సదృశం వీర మారుతస్య మహౌజసః
తద్యథాలభ్యతే సీతాతత్త్వమేవోపపాదయ॥

శ్లో॥ త్వయ్యేవ హనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః
దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయ పండిత!

భూమ్యాకాశ స్వర్గజలాదులందున నీ గమనమునకు అడ్డులేదు. నీతో సమానుడును లేదు. సమస్త లోకములను, సాగర పర్వతాదులను, నీవెరుగుదువు. సురాసురులెల్లరను

నీకు తెలిసినవారే గమనము, బలము, లాఘవము మొదలగు వానితో సీగుండిగియగు వాయువుతో సమానుడవు. బుద్ధి, బలము, పరాక్రమము దేశకాలానుసారముగను పయోగింపుము నీవే సీతను కనుగొని రాగల సమర్థుడవు" అని పలికెను.

భా॥సం- సుగ్రీవుడు ఆంజనేయుని గూర్చి పలికిన మాటలు ఆంజనేయునిశక్తి సామర్థ్యములు చాటుచున్నవి. శ్రీరాముని దర్శించినది మొదలు ఆంజనేయుని మాటలు, శ్రీరాముడు ఆంజనేయునిగూర్చి పలుకుట ఆతని రాజనీతి, రాజభక్తి, ధైర్యమైన పలుకుబడి సమయస్ఫూర్తి స్పష్టమగుచున్నవి. ఈ సుగ్రీవుని మాటలలో ఆతడెంత ఉన్నతుడో స్పష్టమగుచున్నది ఇపుడు సుగ్రీవుడు పలికిన మాటలలోగల సారమంతయు ఈ కాండమున ఇప్పటి నుండి కనపడచు సుందర, యుద్ధ కాండములలో ఆతని విశ్వరూపము సందర్శింపనగును.

శ్రీరాముడు అదివరకే ఆంజనేయుని బుద్ధిబలాదులు బాగుగా ఎరిగిన వాడగుటచేతనే వ్రేలియుంగరము నాతని కిచ్చి "శ్రీ రా మ" ఈ అనవాలువలన సీత నిన్ను గుర్తింపగలదు. బలపరాక్రమాదులలో సాటిలేని వాడవగు నీవే సీతను వెదకిరాగలవు

శ్లో॥ అతిబల! బలవాన్ శ్రితస్త్వాహం
హరివర! విక్రమం విక్రమస్వైః దనవిద్వైః
పవనసుత! యథాఽధిగమ్యతే సా
జనకసుతా హనుమన్! స్తథా కురుష్వ॥

ఓ మహాబలా! నేను నీబలము ను ఆశ్రయించియున్నాను హరివరా! అత్యధికమైన విక్రమాదులతో పరాక్రమింపుము వాయుపుత్రా! జనకసుతయగు సీత ఏవిధముగా కనుగొనబడగలదో హనుమా! ఆవిధముగా ప్రయత్నింపుము" అని పలికెను. ఆంజనేయుడు ఉంగరమందుకొని కన్నులకద్దుకొని రామ సుగ్రీవులకు నమస్కరించి తనవారితో బయలు దేరెను.

భా॥సం- ఆంజనేయుడు తనవద్దనుండి వచ్చిన వాడని సీత గుర్తుపట్టుటకొరకై రాముడు తన చేతి వ్రేలియుంగరము ను అతనికొసగెను. ఇందరు వానరులు యువరాజు అంగదుడు ఉండగా అతనికే యొసగుటయేమి? అనగా మొట్టమొదట రామాంజనేయుల కలయికలోనే ఆంజనేయుడు చాలగొప్ప వాడని రాముడు గ్రహించి దూతకు తగిన లక్షణము లు కలవాడని లక్ష్మణునితో పలికెను అనంతరము ఆంజనేయుడు రామ సుగ్రీవులకు మైత్రి కలిగించుట, వాలి చనిపోగా తారను ఓదార్చిన విధము సుగ్రీవుడు కామ పరతంత్రుడై రామకార్యము మరువగా అతనికి విషయజ్ఞానము కలిగించి, ధైర్యముతో నీతి చెప్పుట మొదలగు వానివలననే గాక, సుగ్రీవుడు ఆంజనేయుని గూర్చి పలికిన మాటలవలన కూడ అతని శక్తిసామర్థ్యాదులు, బుద్ధి నైపుణ్యత, కార్యనిర్వాహణాదక్షత గ్రహించి అతడే తప్పక పనచేసికొని రాగలడని నిర్ణయించుకొని అతనికే ఉంగరమొసగెను ఇది బాహ్యము.

అంతర్యముగా పెద్దలు మరొక విషయము చెప్పెదరు. రాముడు పరమాత్మ సీత జీవాత్మ పరమాత్మను వదలి అన్యదృష్టికలిగి సంసారబద్ధుడై దుఃఖించు జీవుని పునరుద్ధరించు

టకు పరమాత్మయే, సర్వగుణములుగల ఆచార్యుని వరించును. ఆ ఆచార్యుడే హామి ఆతనిద్వారా పరమాత్మ జీవునకందించునదేమి? అభయ మొసగుట పరమాత్మ-

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మాశుచః॥

అని అభయమొసగుచు అభయ హస్తమును చూపెను కదా! ఆ హస్తమునందలి ఉంగరమే రాముడు ఆంజనేయుని ద్వారాపంపెను హస్తమునకు భూషణము కేవలము ఉంగరముకాదు అభయ మొసగుటయే హస్తమునకు భూషణము "హస్తభూషణము ఇచ్చుట" అనగా "అభయ మొసగుట "అని అర్థము" నిన్ను నేను రక్షించెదన" అని ఓదార్చుటయే అభయమిచ్చితినని కబురుచేయుట. ఇది ఆచార్యునిద్వారానే జరగవలెను. ఆంజనేయుడు అదివరకే ఆచార్యునిగా గుర్తింపబడినవాడు గావున అతనిద్వారానే ఉంగరము (హస్తమునకు భూషణము) అయిన అభయ ప్రదానమునువార్త రాముడను పరమాత్మ సీత అను జీవునకు పంపెను. అని చెప్పుదురు.

సుందరకాండలో సీతమ్మ ఆంజనేయుడిచ్చిన రామా నామాంకితమైన ఉంగరము చూచి మిక్కిలి సంతసించినదట.

శ్లో॥ గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణం
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితా౽భవత్॥

ఇచ్చట కూడ కరవిభూషణముగా "పరమాత్మ యొసగిన అభయ ప్రధానమని పెద్దలు చెప్పుదురు దానికి అనుగుణముగనే సీత గుర్తుగా "శిరోమణిని" ఒసగుట తాను శరణా అంగీకరించినట్లు తెలియు చేయుటయేనట"

రాముడు ఆంజనేయునితో పలికిన చివరి మాటలలో మరియొక ధ్వనియున్నదని పెద్దలు చెప్పుదురు. సర్వేశ్వరుడు ఈలోకమున వేదమతము నశించిపోవుచుండగా దానిని ఉద్ధరించుటకై శేషుడను స్వశక్తినొసగి, బౌద్ధ, చార్వాక, పాషండాది, మతములను ఎదిరించి కర్మాచరణ ప్రధానమగు వేదమతములను ఉద్ధరింపుమని చెప్పెనట అదియే ఇందులో ద్యోతకమగును.

అతిబల – మిక్కిలి బలము కలవాడా! అనగా (శేషుడు భూమిని భరించుటచే మిక్కిలి బలము కలవాడు సామాన్యము) ఇక సర్వశక్తులు అనగా ఉభయవిభూతులు (నిత్య విభూతి, లీలావిభూతి "అనగా" నిత్యము – ఎల్లప్పుడు నుండు పరమపదైశ్వర్యము లీలయైన విలాసమునకై సృష్టించుకొన్న ఈ లోకమందలి ప్రకృతి సంపద, కలిగిన మహాబలుడవు – అని భావము – బలమాశ్రితస్త్వాహం – ఈ రెండుబలములు కలిగిన నీపై నేనాధారపడియుంటిని పరమాత్మ నెఱుగవలెనన్న పరమాత్మచే నొసగబడిన వేదమతము ధరింపబడవలెను గదా! అందుచే హరివీర! దోషసంకలితములైన సర్వమతములను హరించువాడా! "విక్రమ, విక్రమైరనల్పైః" అధికపరాక్రమముతో" అనగా అమితములైన వేదాదులలోగల అఖండ

పాండిత్యముతో పరాక్రమింపుము పర + ఆక్రమించు = పరమాత్మను గ్రహించుట, ఇతరములను ధ్వంసముచేసి "ఆక్రమించుట" చేయుము అనగా నేనొసంగు భయవిభూతి శక్తులు, వేదము, వీనితో ఇతరములను ఏవిధముగా నశింప చేయగలుగుదువో అట్లు ఇతరులను ఆక్రమింపుము.

"జనకసుత" అనగా కేవల కర్మాచరణులై యజ్ఞాదుల నాచరించు జనకాదులచే కుమార్తెవలె ఆదరింపబడినది జనకాదులు కర్మాచరణమున ప్రసిద్ధులు, లేక (జనకాదులచే ఆచరింపబడినది) "అది వేదమత సిద్ధాంతము" దానిని ఏ విధముగా పొందబడగలవో ఆవిధముగా ప్రవర్తింపుము అని పరమాత్మ వేదబాహ్యము (కర్మ విహీనములగు) చార్వాక పాషండాది మతములను ఖండించి సత్ కర్మానుష్ఠాన ప్రధానమైన వేదమతమును, ఉద్ధరింపుమని, ఆచార్య స్థానీయుడైన ఆంజనేయునకు చెప్పెనట సాధారణార్థము - మిక్కిలిబలము కలవాడవు, కపిశ్రేష్ఠుడవు, వాయుపుత్రుడవు, అగు ఆంజనేయా! నీ పరాక్రమమును చూపి నీపై ఆధారపడి యున్న మా కార్యమగు సీతమ్మను వెదకుటకై విక్రమింపుము.

తరువాత నెలదినములలోనే తూర్పు, పడమర, ఉత్తర దిక్కులకు వెళ్ళిన వానరులు తిరిగివచ్చి సీతమ్మ జాడ తెలియ లేదనియు. దక్షిణ దిక్కుకు వెళ్ళిన ఆంజనేయుడే తప్పకచూచి రాగలడనియు పలికిరి. శ్రీరామాదులెల్లరను అదే అభిప్రాయముతో నుండిరి

ఆంజనేయుడు తనవారెల్లరితో కలిసి పట్టణములు, పల్లెలు, కొండలు, అడవులు వెదకుచు వింధ్య పర్వత ప్రాంత

ములకు పోవుసరికే నెలదినములు గడిచిపోయెను. వారికి మిక్కిలి దాహము వేసెను. ఆ పర్వతపు బిలమునుండి తడిసిన రెక్కలుగల హంసలు వచ్చుచుండుట చూచి ఆంజనేయుడు అందు తప్పక నీరుండునని ఊహించి తనవారందరితో ఆతి కష్టముతో ఆ బిలములో ప్రవేశించెను. అచట బంగారు భవనములు, రత్నమయములైన విమానములు, కాంతులు వెదజల్లు పూలతో గూడిన వృక్షములు గలవు. వాటిని చూచుచుండగా అచట ఒక తాపసి కనపడెను. ఆమెను చూచి ఆంజనేయుడు "నీవెవరవు? ఈ గుహ యెవరిది?" అని అడుగ ఆమె "ఆగుహ హేమ అను అప్సరకాంతది" అనియు, దానవ శిల్పియగు మయుడు వేయి సంవత్సరములు తపమొనరించి బ్రహ్మచే వరములను పొంది, దీని నిర్మించి ఇందు "హేమ"తో గూడ నివసించి ఉండగా ఇంద్రుడాతనిని చంపెననియు తాను మేరుసావర్ణి కుమార్తె స్వయంప్రభ యనియు, హేమ తనకు స్నేహితురాలగుటచే ఆమె మాట ప్రకారము తానందుండి, ఆ పుష్పోద్యానమును కాపాడుచుంటిననియు పలికి "మీరెవ్వరు? ఇందులకేల వచ్చితిరి? ఇకనో ఈ పండ్లు తిని నీరుత్రాగి నేను వినదగినదే అయినచో మీ వృత్తాంతమును చెప్పుడు" అని పలికెను

వానరులు స్వయంప్రభ యిచ్చిన పండ్లుతిని, నీరుత్రావి, ఆకలిదప్పులను తీర్చుకొని సేదదీరి జరిగిన రామ సుగ్రీవాదుల వృత్తాంతమంతయు చెప్పి "అమ్మా! సీతమ్మను వెదకుచుండగా గడువుదాటినది అయినను ఈ గుహ దాటించి పుణ్యము కట్టుకొనుము ఇంకను వెదకవలెను". అని పలుక! ఆమె తన

కాక సుగ్రీవుడు బలవంతుడు వానితో విరోధము కల్పించుకొ నుట మంచిది కాదు ఈ బిలము వందున్నను లక్ష్మణుని బాణములు ఈ పర్వతమును భేదించుకొని వానరులను సంహరించును అందుకు భయపడి యీ వానరులు మరల సుగ్రీవునే చేరుదురు ఒంటరి వాడవై నీవేమి చేయగలవు? కిష్కింధకు పోయినయెడల సీతల్లిపై గల ప్రేమచే సుగ్రీవుడు నిన్నేమియు చేయడు అని పలుకగా అంగదుడిట్లనెను.

వాయుపుత్రా! సుగ్రీవుడు ఉత్తమ బుద్ధికలవాడు కాడు తన అన్న గుహలో శత్రువులకు చిక్కియుండగా రాయి మూతవేసి యింటికి వచ్చెను. అన్న భార్యను తనకు భార్యగా స్వీకరించెను ఉపకార మొనర్చిన రామునే మరచెను. లక్ష్మణుని బాణములకు భయపడి సీతను వెదకుటకై వానరులను పంపెనే గాని, రామునితోగల స్నేహమువలన గాదు. అట్టివాడు శత్రుకుమారుడనగు నన్ను కాపాడునా! ఔరసుడగు కుమారు నకు రాజ్యమిచ్చుట న్యాయము గాని నన్ను చేరనీయుడు కావున నేను ప్రాయోపవేశము చేసి మరణించెదను రామ లక్ష్మణులను, సుగ్రీవుని, మాతల్లిని, తల్లివంటి "రుమ"ను సమస్కార పూర్వకముగా అడిగితినని చెప్పుము. అని పలికి దర్భలపై ప్రాయోపవేశము చేసెను.

వానరులును దుఃఖించుచు తాముగూడ చనిపోవుటకే నిశ్చయించుకొని జరిగిన కథ అంతయు చెప్పుకొనుచుండగా "సంపాతి" అను పక్షి వారిని భక్షించుటకు వచ్చుచు వారి మాటలలో తన సోదరుడగు "జటాయువును గూర్చి విని"

ఎవరుమీరు? జటాయువు నా సోదరుడు ఆతడు రామునకెట్లు మిత్రుడయ్యెను? ఎట్లు మరణించెను? అని అడుగగా అంగదు డిట్లుపలికెను "పక్షిరాజా! తండ్రి యాజ్ఞచే అరణ్యావాసము చేయుచున్న రామునకు దండకారణ్యములో జటాయువు స్నేహితుడయ్యెను రామలక్ష్మణులను మోసపుచ్చి రావణుడు సీతను అపహరించుచుండగా జటాయువు ఆతని ఎదిరింప రావణుడు జటాయువు రెక్కలు నరికిచంపెను. రాముడు సీతను వెదకుచువచ్చి జటాయువునకు సంస్కారమొనరించి ఆతనికి ఉత్తమ లోకములను కల్పించి కిష్కింధకువచ్చి వాలిని చంపి సుగ్రీవునకు రాజ్యమిప్పించెను. సుగ్రీవుడు సీతమ్మను వెదకుటకై మమ్ములను పంపెను. కాని గడువు మీరినందున మేము తిరిగి వెళ్లిన ఆతడు మమ్ములను చంపునని ప్రాయో పవేశము చేసితిమి. ఆ రావణునిగూర్చి నీకేమయిన తెలిసిన చెప్పుము అని పల్కెను.

ఆ మాటలు విన్న సంపాతి "వానరులారా! ఆ జటాయువు నా సోదరుడు. ఆతనిని చంపిన రావణుడు నాకును శత్రువే ఆతడొక స్త్రీని ఆకాశమార్గమునగొని పోవుచుండగా చూచితిని. రాముని కీర్తించుచుండుటచే ఆమె సీతయే కావచ్చును ఇచటికి నూరుయోజనముల దూరములో సముద్ర మధ్యమున లంకానగరముకలదు. అక్కడ రాక్షస స్త్రీలచే సీతమ్మ కాపాడబడుచున్నది. సూర్యరశ్మికి నా రెక్కలు కాలిపోయినవి నేనెగురలేను. నన్ను సముద్రము వద్దకు గొనిపొండు. మా సోదరునకు ఉదకదానముచేయుదును" అని పలుకగా వారు సంపాతిని సముద్రము వద్దకుగొనిపోయిరి

సంపాతి జటాయువునకు ఉదకదానము చేసెను. వెంటనే ఆతనికి రెక్కలు వచ్చెను. ఆతను మరల వారితో" వానరులారా! నిశాకరుడను మహర్షి నాతో "నీవు వానరులకు సీతవృత్తాంత ము చెప్పిన తరువాత నీకు రెక్కలు వచ్చును" అని చెప్పినారు అట్లే యిప్పుడు రెక్కలు వచ్చినవి ఇది శుభసూచకము మీరు సీతను కనుగొనగలరు. వెళ్ళిరండు." అని పలికి ఎగిరి పోయెను.

వానరులు సీతమ్మ వృత్తాంతము తెలిపినందులకు మిగుల సంతసించుచు గంతులువైచిరి వెంటనే సముద్రపు ఒడ్డుకు చేరిరి. లోకమునకు ప్రతిబింబముగ తెను ఆకాశము వలె అంతులేనిదియును, భయంకర జల జంతువులచే నిండినది యు ఉత్తుంగ తరంగములచే మహాభయంకరమైనదియు అగు సముద్రమును చూచిరి. నూరుయోజనములు (800 మైళ్లు 1200 K M) సముద్రమును దాటగలవాడెవడు? అని మరల విచారమునందుబడిరి. అంగదుడు వారందరికిని ధైర్యము చెప్పి విషాదపడవలదనియు, అది మిక్కిలి దోషమనియు, ఆ విషాదము కోపించిన పాము వలె బాధించుననియు పలికి "ఈ సముద్రమును దాటి సీతమ్మను చూచి రాగలవాడెవడు? సుగ్రీవుని మాట నిలబెట్టి మరల మనము భార్యాపుత్రులతో సుఖముగా నుండునట్లు చేయుగలవాడు ఎవడు" అని ప్రశ్నించెను మరల ఎవరెవరెంత దూరము పోగలరో వారి వారి బలముల నడుగగా పదియోజనములు మొదలుకొని నూరుయోజనము లు వరకు పోవువారే కాని తిరిగి వచ్చువారు లేకపోయిరి. జాంబవంతుడును "వృద్ధుడనగుటచే వెళ్ళజాలన"ని పలుకగా

అంగదుడు "నేను నూరు యోజనములు వెళ్ళుదును. కాని తిరిగి రాగలనో లేదో అని నా అనుమానము" అని పలుకగా జాంబవంతుడు "నాయనా! నీవు యువరాజువు రాజు భృత్యుల చే పని చేయించుకొనవలెనే గాని, భృత్యులచే అతడు నియమింపబడకూడదు నీవు మా స్వామివి నిన్ను రక్షించు కొనుట మా కర్తవ్యము కావున నీవు వెళ్ళవలదు" అని పలుకగా అంగదుడు "అట్లయిన యీ కార్యమెట్లు సాధింపబడును?" అని ఆలోచించుచుండగా జాంబవంతుడు "యువరాజా! నీవు విచారింపకుము ఈ కార్యము సాధింపగల వానిని నేను ప్రోత్సాహపరచెదను" అని పలికి ఏకాంతముగా దూరముగా సుఖముగా కూర్చొని యున్నవాడును, లంఘనా దులలో మిక్కిలి శ్రేష్ఠుడును ప్రసిద్ధుడును అగు అంజనేయుని సమీపించి యిట్లు పలికెను

భా॥సం ఇచటి రాజకీయములు కొంచెము గమనింపవలయును ఆంజనేయుని బుద్ధి నాతుర్యత, కార్యదక్షత, రాజభక్తి ప్రత్యక్షము. అంగదుని మాటలలో ఆతనికి సుగ్రీవునిపై గల అసహ్యము, క్రోధము, స్పష్టమగుచున్నది అది సహజమే. తన తండ్రి భూ వివరములో రాక్షసులను చిక్కియుండగా సుగ్రీవుడు ఒక రాతిబండ ఆ వివరము (కన్నము)నకు అడ్డుగా పెట్టివచ్చెను. అందులకు వాలి కోపింప శ్రీరాముని శరణు కోరి వాలిని చంపించెను. తారను భార్యగా స్వీకరించెను ఈ విషయములు అతనిమనస్సును కలతపెట్టుటలో ఆశ్చర్యము లేదు కాని ఆ కలతలోనున్న అంగదునికి సుగ్రీవుని మనస్సు పూర్తిగా మారినదని ఏమాత్రము గ్రహించెడి అవకాశము

లేదు. ఇది సహజము కాక ఆతనిది ఉమకురకిగా కాన కోపము సహజము అందుచే గడపు దాటుటవలన తిరిగి వెళ్ళలేకయు సుగ్రీవుడు చంపునని భయము సీతకనపడకుండగనే రామకార్యము నెరవేరలేదని విచారము రామలక్ష్మణుల సామర్థ్యము ఎరిగియుండుట, ఈ మొదలగునవి యన్నియు అతని మనస్సును పూర్తిగా దొలిచివేసి సుగ్రీవుని సంహరించుటకు దారితీయించినవి

చాల అనుభవముగల "బుద్ధిమతాంవరిష్ఠుడు" అయిన ఆంజనేయుడు సుగ్రీవాంగదులను పడతీయ వీలుకాని బంధమున చిక్కుకొనునట్లు చేసెను అక్కడ సుగ్రీవునకు అంగదునిపై పూర్తి మమకారము కలుగునట్లు చేసెను. సుగ్రీవునకు సంతానమున్నట్లు ప్రత్యేకముగా ఎక్కడనూ వ్రాయబడలేదు అంగదుడు మాత్రము "ఔరస పుత్రుడుగనుండు వానిని" రాజ్యములో స్థాపించుటయుక్తము" అని పలికెను కాని సుగ్రీవునికి ఔరసుడున్నట్లు లేదు. వాలి చనిపోవుచు అంగదుని "ఈతడు నీకు పుత్రసమానుడు" అని సుగ్రీవున కప్పగించెను కాంచనమాలను ఇచ్చెను తారను గౌరవముగా చూడుమనెను వీనికన్నిటికి ముగ్ధుడైన సుగ్రీవుడు వాలివధకు మిక్కిలి విచారించి అగ్నిదగ్ధుడనగుదునని పల్కెను కాని రామాదుల మాటలకు తేరుకొని వానర రాజ్యపట్టాభిషిక్తుడై అంగదుని కౌగలించుకొని యువరాజ పట్టాభిషేకము చేసి తారను భార్యగా స్వీకరించెను తార తనకెప్పుడు భార్య అయినదో అంగదుడు తన కుమారుడే అగునట్లు చూచుట న్యాయమేగదా! "అంగదం సంపరిష్వజ్య యౌవ

రాజ్యేఽభిషేచయత్" పుత్రీగాత్రి పరిష్వంగముచే సుగ్రీవుని లో ఏమాలిన్యము లేకుండుటయు, అంగదుని విషయములో కోపము లేకుండుటయు నిర్వివాదము.

కాక సుగ్రీవుడు తన భార్యయగు "రుమ" పైకంటెను తారపై మిక్కిలి ప్రేమయు, ఆమెను మిక్కిలి గౌరవించుట యు, ఆమెద్వారానే తనరాజకీయములన్నియు నెరవేర్చు కొనుచున్నట్లును కనపడుచున్నది. కనుక సుగ్రీవునకు వారిరు వురిపై కోపము లేనట్లే స్పష్టము.

వాలి భూవివరములో చనిపోయెననియే మంత్రులు మొదలగువారి బలవంతముచే పట్టాభిషేకము గావించుకొనుట స్పష్టముగదా! అదే దృష్టితో వాలి చనిపోయెననియే తార నుగూడ గ్రహించియుండవచ్చును. కాని వాలితిరిగివచ్చుటచే అతడు బ్రతికియుండగా తారను సుగ్రీవుడు గ్రహించెనని అంగదుని క్రోధము "జీవతో మహిషీం ప్రియాం" అంటాడు కాని ఆవిషయము సుగ్రీవునకు తెలియదుగాన అతడు దోషి కాడేమో అనిపించును అంగదునకు యువరక్తపు వేడిచే సుగ్రీవుని నిందించుటయు సహజమే.

ఈ విషయములన్నియు యువకుడగు అంగదుడు గ్రహింపక పోయినను, ఆంజనేయుడు గ్రహించి అంగదుడు ప్రాయోపవేశమునకు సిద్ధపడగా ఎన్నియో విధముల ఆతనికి నచ్చచెప్పెను. "సుగ్రీవుడు తారపైగల ప్రేమచే నిన్ను చంపడు" అని సామముగా చెప్పెను. "సుగ్రీవుడు నిన్నే

యువరాజును చేసెను. అని దానముపయోగించెను." ఈ వానరులు భార్యా పుత్రులపై ఆశతో నిన్ను విడతురు. అని భేదముగా పలికెను చివరకు "నీవెక్కడున్నను రామ లక్ష్మణుల బాణములు నీ ప్రాణములు తీయక మానవు" అని దండోపాయముపయోగించెను.

ఆంజనేయుడు ఇంతశ్రమపడవలసిన అవసరమేమి? అనగా" సుగ్రీవాంగదులు వేరుకాకుండుటయే" అని స్పష్ట మగుచున్నది వారిరువురు వేరయిన రాజ్యము చీలుట, వారిలో అంతఃకలహములు, ప్రస్తుత కార్యవిఘ్నము అగుట తథ్యము. అంతేకాదు. అంగదుడు వాలివలె మిక్కిలి బలవంతుడు. రాజ్యపాలనకు తగు సామర్థ్యము. గలవాడు- అందుకే అంగదుని గూర్చి

శ్లో॥ బుద్ధ్యాహ్యష్టాంగయా యుక్తం చతుర్బల
సమన్వితం
చతుర్దశగుణంమేనే హనుమాన్ వాలినస్సుతం.

శ్లో॥ ఆపూర్యమాణం శశ్వచ్చ తేజోబల పరాక్రమైః
బృహస్పతి సమంబుద్ధ్యా విక్రమే సదృశం పితుః
భర్తురర్థే పరిశ్రాంతం సర్వశాస్త్రవిశారదం॥

అంటాడు ఆంజనేయుడు "గ్రహణ ధారణాది అష్టాంగ బలములతో కూడినవాడు. బాహు, మనో, ఉపాయ, బంధు బలములతోనున్నవాడు. దేశకాలాదుల నెఱిగెడి పదునాల్గు గుణములతో నొప్పు వాడు. తేజో బలపరాక్రమాదులు

మాటి మాటికి వృద్ధిపొందుచున్నవాడు. బుద్ధిలో బృహస్పతి వంటివాడు, బలములో తండ్రితో సమానుడు. అన్ని శాస్త్రములు నెరిగినవాడు యజమాని కొరకై మిక్కిలి శ్రమపడువాడు" ఇట్టి గుణములుగల అంగదుడు సుగ్రీవుని నుండి దూరమైనయెడల సుగ్రీవునకెప్పుడు ప్రమాదము సంభవించుటయేగాక ఏకత్వములో భిన్నత్వమేర్పడి రామకార్యమెట్లు జరుగునో అని ఆలోచించి తన రాజకీయ చతురతనంతయు' నుపయోగించి అంగదుని మార్పజూచెను. దీనిచే అంగదుని విశిష్టత తెలియుటయు, ఆంజనేయుని బుద్ధి కుశలత, రాజ్యకార్యదక్షత, స్పష్టమగుచున్నది

ఇది యంతయు బాహ్యము ఆంతర్యమే మన ఆంజనేయుడు ఆచార్యుడు. ఆచార్యుడు సర్వశాస్త్ర పండితుడై శిష్యులను భగవత్కార్యాసక్తులను చేయవలెను. అంగదాదులు శిష్యులు భగవదాభిముఖ్యమును, తమకుగల సాంసారిక కష్టములచే (ఆహార విహారాదులలోగల ఇబ్బంది) "ఇక యీపని చేయలేము" అని నిర్వేదము నొందగా ఆనిర్వేదమును తొలగించుటకు ఆచార్యులు చేయవలసిన కృషి యంతయు ఇందు చూపబడినది. శిష్యులకు భగవదాభిముఖ్యమును కల్గించుటకు ఎన్నివిధములుగా చెప్పవలెనో సూచింపబడినది. ఆచార్యుడెంత శ్రమపడినను, భగవత్కటాక్షము లేని జీవులకు భగవదాభిముఖ్యము కలుగదు (అందుచేతనే ఆంజనేయుని మాటలను త్రోసిపుచ్చి అంగదుడు ప్రాయోపవేశమొనర్చెను ఆచార్యుడును ఏమి చేయుటకు తోచకున్న సమయమున భగవంతుడే సంపాతిరూపమున భగవదాభి

ముఖ్యము కలుగునట్లును, జీవులు వారివారి కార్యములలో ప్రవర్తించునట్లును చేసెను వెంటనే జీవులు కార్యాభిముఖులైరి కాని తాము స్వతంత్రించిరా లేదు మరల ఆచార్యునే (ఆంజనేయునే) ఆశ్రయించి తమ కార్యమును నెరవేర్చుకొని తద్వారా భగవంతుని (శ్రీరాముని) మిక్కిలి ఆనందముతో చేరగలిగిరి. చేతనులను తరింపచేయుటకు ఆచార్యుడే సాధనము ఆతడెంత చేసినను ఆపని జరుగనినాడు స్వయముగా సర్వేశ్వరుడే ఆకార్యము నెరవేర్చును భగవత్ప్రేరణ చేతనే చేతనులు మరల ఆచార్యునిద్వారానే భగవదాభిముఖ్యము కలిగి భగవంతుని చేరుదురు! అని ధ్వనించుచునని పెద్దలు చెప్పుదురు.

వృద్ధుడగు జాంబవంతుడాంజనేయునితో "వానరావీరా! నీవు బలపరాక్రమాదులలో రామ, లక్ష్మణ, సుగ్రీవులతో సమానుడవు, గరుడునివంటి వేగము కలవాడవు బుద్ధి, బలము, తేజస్సు" వీర్యము, అన్ని భూతములకంటె నీకే యెక్కువ "పుంజకస్థల" అను అప్సరస శాపవశమున "అంజన" అను పేరుతో "కుంజరు"డను వానరునకు పుత్రికగా జన్మించి కేసరి అను వానరునకు భార్య అయ్యెను. ఆమె కామరూపిణి గావున ఒక వర్షాకాలమున అందమైన యువతిగా ఒక కొండ చరియపై సంచరించుచుండ ఆమె అందము చూచి ఆమె అప్సరస గావున వాయువు మోహించి ఆమెను అనుభవింపగా మహాబల సంపన్నుడవగు నీవు సద్యోగర్భమున జన్మించితివి. పుట్టిన వెంటనే సూర్యబింబమును చూచి ఫలమనుకొని దానిని పట్టుకొనదలచి నీవు మూడువందల యోజనములు (2400 మైళ్లు - (3840 K M) మీదకు ఎగురగా ఇంద్రుడు వజ్రా

యుధము నీపై విసరెను. దానిచే నీవు క్రిందపడగా నీ యెడమ చెంపకు దెబ్బతగిలెను. అందుచే "హనుమంతుడు" అను పేరు కలిగెను. అందులకు నీ తండ్రి అలుగుటచే బ్రహ్మ నీకు శస్త్రాస్త్రములచే మరణము లేకుండునట్లును, ఇంద్రుడు స్వచ్ఛందమరణమును వరముగా నొసగిరి. నీవు వాయు దేవునంతటివాడవు అందుచే సముద్రమును దాటగలవు. నీవు సముద్రమును దాటి లంకకు వెళ్ళి సీతమ్మను జూచివచ్చి మాకు దుఃఖమును పోగొట్టుము శ్రీరామునకు ప్రియమును గూర్చుము" అని ఉత్సాహపరచెను.

వెంటనే ఆంజనేయుడు మహోత్సాహముతో శరీరమును పెంచి మహేంద్ర పర్వతము నెక్కి "వానరులారా! నేను వాయుదేవుని ఔరసపుత్రుడగుటచే ఎంత దూరమైనను ఎగిరిపోగలను. సూర్యాది గ్రహములను దాటి సంచరించ గలను. కొండలను పిండిచేయగలను భూమిని చీల్చుకొని పోగలను లంకకుపోయి సీతమ్మను చూచి రాగలను. మీ రందరును సంతోషముగానుండుడు. "అని పలుక జాంబవంతు డింకను ఆతనిని యుత్సాహపరచుచు" వీరుడా! నీవు తప్పక ఈ కార్యము సాధింపగలవు. నీవు వచ్చువరకు మేము ఒంటి కాలిపై నిలబడియుందుము. మా ప్రాణములు నీయధీనము అని పలుకగా ఆంజనేయుడు మనస్సు స్థిరపరచుకొని శరీరము నింకను పెంచి సముద్ర లంఘనమునకు సిద్ధపడెను.

భా॥సం- "పుంజికస్థల" అను నామె అప్సరసలో ఒకతె ఈమె చాల అందమైనది. సముద్ర మథనమునందు అప్సరసలు జన్మించిరి. వీరిని దేవతలు పరిచారికలుగాను వేశ్యలుగాను

పరిగ్రహించిరి. ఈమె శాపముచే వానరీ రూపముపొందినది. కాని కామరూపిణియగుటచే తన అందమైన మానవరూపము లో సంచరించుచుండగా అప్సరస భావముతో వాయు వామెను అనుభవించుటచే సద్యోగర్భమున ఆంజనేయుడు జన్మించెను

శ్లో॥ అప్సు నిర్మ నాదేవ తస్మాదప్సరసోఽభవన్
నతాస్మ పరిగృహ్ణంతి సర్వేతే దేవదానవాః
అపరిగ్రహణాత్తాశ్చ సర్వాస్సాధారణాస్మృతాః

మహాబలుడగు వాయువునకు సూర్యబిలలో ద్భూత యగు పుంజికస్థలకును జన్మించుటవాడగుట ఆంజనేయుడు మహాబలవంతుడు లంఘన సమర్థుడు కామరూపియుఅయ్యెను.

శ్రీ మహావిష్ణువు శ్రీరాముడుగా అవతరింపగా బ్రహ్మ దేవతలనందరను, "అప్సరసలయందును గంధర్వ స్త్రీలయందును, హరిరూపులగు పుత్రులను సృజింపవలసినదిగా ఆజ్ఞాపించెను. తత్ప్రకారము ఇంద్రాదులందరు వాలి మొదలగు వారిని సృజించిరి

(వాయు కుమారుడు ఆంజనేయుడు)

శ్లో॥ మారుతస్యాత్మజశ్శ్రీమాన్ హనుమాన్నామ వీర్యవాన్
వజ్రసంహననోపేతః వైనతేయసమోజవే॥

వీర్యవంతుడు వజ్రమువలె అభేద్యమగు శరీరము కలవాడు, గరుడునివంటి వేగము కలవాడు. అగు ఆంజనేయుడు వాయువు కుమారుడు.

శ్లో॥ క్షిప్తమింద్రేణ తే వజ్రం క్రోధావిష్టేన ధీమతా
తతశ్శైలాగ్రశిఖరే వామో హనురభజ్యత
తతోహి నామధేయం హి హనుమానితి కీర్త్యతే॥

వజ్రము యొక్క దెబ్బనుగూడ లక్ష్యము చేయునంతటి బలపరాక్రమములు గలవాడు. అందుచేతనే ఆచార్యుడయ్యెను. ఎట్టి ప్రలోభములకుగాని ఎట్టి తాకిడులకు లొంగక తన కార్యమును నిర్దుష్టము చేయగలిగినవాడే ఆచార్యుడు. అందులకే శ్రీరాముడు ఆంజనేయుని ఆచార్యస్థానీయునిగా చేసెను.

శ్లో॥ సవేగవాన్ వేగసమాహితాత్మా
హరిప్రవీరః పరవీర హంతా।
మనస్సమాధాయ మహానుభావో
జగామ లంకాం మనసా మనస్వీ॥

భా॥సా॥ జీవుల ఆక్రందనమువిని భరింపలేని పరమాత్మ (రాముడు) సులక్షణముల గల ఆచార్యుని ఆ జీవులను ఓదార్చుటకై పంపగా ఆ భగవదాజ్ఞయందే బుద్ధినిలిపి బాహ్యములు, ఆంతర్యములు అయిన శత్రువులను నాశనము చేయు ఆచార్యుడు, అను ఆంజనేయుడు లంక అను శరీరములో (మగ్గుచున్న సీతను) జీవుని భగవత్కారావలంబము (అంగుళీకము నిచ్చి) ఓదార్చుటకై మనస్సు స్థిరపరచుకొని పోవుటకు యత్నించెను.

శ్లో॥ కిష్కింధాఖ్య మిదం శృణ్వాన్ పఠన వాపి
విధానతః
ఇహ సంపూజిత స్సర్వైః అంతే బ్రహ్మణి
లీయంతే ॥

ఇది కిష్కింధాకాండము

భావార్థ సంగ్రహము.



# శ్రీ సుందర, యుద్ధ కాండములు

## శ్రీరామ పట్టాభిషేకము

ఆంజనేయుడు నూరుయోజనముల సముద్రముదాటి లంకలో ప్రవేశించి లంకిణిని చంపెను. లంకంతయు నాలుగు మార్లు వెదకి సీతమ్మను గాంచెను రావణుడు సీతమ్మను పరుషముగా మాటలాడుట, సీతమ్మ సమాధానము రాక్షస స్త్రీల పరుష వాక్యములు, త్రిజటా స్వప్నవృత్తాంతమువినెను. అనంతరము సీతమ్మతో రామాదుల వృత్తాంతము చెప్పి శ్రీరాముని అభయ ప్రదాన రూపమగు కరవిభూషణమైన ఉంగరమునిచ్చి ఆమెకు సంతసము గూర్చ ఆమె రామాజ్ఞను శిరోధార్యముగా గ్రహించిన గుర్తుగా శిరోభూషణము నను గ్రహించెను. మారుతి ఆమెకు ధైర్యముచెప్పి వనభంగము చేసెను రావణుని పంపున వచ్చిన ఎనుబదివేలమంది రాక్షసు లను, జంబుమాలిని, పంచసేనా నాయకులను, ఎనమండుగురు మంత్రి పుత్రులను, అక్షయకుమారుని సంహరించి ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునకు స్వయముగా కట్టుబడి రావణుని వద్దకు కొనిపోబడెను. రావణునకు, సామాద్యు పాయములతో ధర్మయుక్తమైన నీతి బోధచేసెను. రావణుడు ఆంజనేయుని చంపుడని ఆజ్ఞ ఈయగా "విభీషణుడు" దూత లను చంపుట నీతిగాదన రాక్షసులు వాయుపుత్రుని తోకకు నిప్పు పెట్టిరి సీతమ్మ ప్రభావము వలన ఆ యగ్ని మారుతికి ప్రాలేయానిల శీతలమయ్యెను రాక్షసులు పెట్టిన నిప్పుతోనే ఆంజనేయుడు లంక (నంత)ను కాల్చెను. మరల సీతమ్మ క్షేమ

మరల సముద్రము తిరిగి సముద్రమును దాటివచ్చి వానరులకా వృత్తాంతము చెప్పి తన సంతోషము తెలియబరచుటకేమో అన్నట్లు, మధువనమున తేనెలు త్రాగి స్వేచ్ఛగా విహరించిన వానరులతో కలసి ఆంజనేయుడు రాముని సమీపించి సీతమ్మ క్షేమవార్త నెరింగించెను రాముడానందించి ఆంజనేయుని కౌగిలించుకొనెను

వెంటనే యుద్ధభేరీ మోగించి శ్రీరాముడు కోటానకోట్ల వానర సైన్యముతో దక్షిణ సముద్రతీరమును జేరి సముద్రుని శరణుకోరెను. ఇటు లంకలో ఆంజనేయుడు తిరిగి వెళ్లిన తరువాత విభీషణుడు రావణునకు హితబోధ చేయగా ఆతడు విభీషణుని యిల్లు వెడలగొట్టెను విభీషణుడు వచ్చి శ్రీరాముని శరణుకోరగా శ్రీరాముడాతనికి అభయమొసగి "శరణాగత వత్సలుడ"ను బిరుదుగాంచెను. సముద్రుని సలహాతో నలుడను వానరునిచే నూరు యోజనముల దూరము సముద్రములో సేతువు నిర్మింపచేసి సర్వ వానర వీరులతో గూడ లంకానగరమును చేరెను

వానర రాక్షసవీరులకు బ్రహ్మాండమైన యుద్ధము జరిగెను చాలామంది రాక్షసవీరులు మరణింపగా ఇంద్రజిత్తు నాగపాశము రామలక్ష్మణులను బంధించెను గరుత్మంతుడు వచ్చి వారిని విడిపించెను రావణుడు యుద్ధమునకు రాగా రాముడాతని గుఱ్ఱములను, సారథిని చంపి, రథమువిరచి, ధనుర్బాణములను ధ్వంసముచేసి మకుటభంగముచేసి ఆతనికి బుద్ధివచ్చునేమోయని చంపక విడిచెను. కాని ఆ మూర్ఖునకు బుద్ధిరాలేదు. కుంభకర్ణుని లేపి యుద్ధమునకు పంపగా రాము

డాతనిని వధించెను. ఇంద్రజిత్తు మాయా యుద్ధముగావించి సర్వ వానర సైన్యమును రామలక్ష్మణులతో సహా మూర్ఛపడ వేయగా ఆంజనేయుడు ఔషధి పర్వతమును తెచ్చి అందరిని బ్రతికించెను. మాయా సీతను వధించి నికుంభిలాహోమము చేయుచున్న ఇంద్రజిత్తును, విభీషణ హనుమదాదుల సహాయములో రామాజ్ఞతో లక్ష్మణుడతనిని చంపెను. తుదకు లోక కంటకుడైన రావణుని శ్రీరాముడు బ్రహ్మాస్త్ర ప్రయోగమున సంహరించి విభీషణునకు లంకా రాజ్యమున పట్టాభిషేకము చేయించెను లోకాపవాదము రాకుండుటకై సీతా మహాతల్లిని అగ్నిప్రవేశము చేయించెను. అగ్నిదేవుడా పతివ్రత నిర్దోషురాలని తిరిగి రామునకు సమర్పించెను,

బ్రహ్మాదులు ప్రత్యక్షముగా వచ్చి సీత పరిశుద్ధరాలనియు స్వీకరింపవలసినదనియు చెప్పి శ్రీరాముని అవతార రహస్యము చెప్పిరి రాముడు మానవమాత్రుడుగ, మానుష భావముతోనే వారి వలన వరములను గొనెను. దేవతలతో బాటు దశరథుడు గూడ వచ్చి వనవాస వ్రతమును ముగించిన సీతారామ లక్ష్మణులను గాంచి ఆనందించెను. శ్రీరాముడు తండ్రిని కైకేయి దోషములను మరచిపొమ్మని కోరెను. ఎల్లరును మిక్కిలి సంతసించి రాముని కీర్తించిరి.

విభీషణుని చే సమర్పింపబడిన పుష్పక విమానము పై నధిరోహించి, వానరులు, విభీషణాదులు వెంటరాగా సీతా లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు అయోధ్యకు బయలుదేరెను. కిష్కింధలో "తార" మొ॥ వానర స్త్రీలు గూడ విమాన

సధిరోహించిరి. ముందుగా భరద్వాజాశ్రమమునకేగి, హనుమంతుని, గుహుని వద్దకు భరతుని వద్దకు పంపి మరునాడు తానును సర్వసైన్యములతో నంది గ్రామమును చేరెను భరతాదులు మిక్కిలి సంతసించి రాముని పాదములకు ప్రణమిల్లిరి ఆతడు రాముని ప్రార్థించి రాజ్యమునకు పట్టము గట్టుకొమ్మనెను. రాముడంగీకరించెను వానరులు నాల్గు సముద్రముల నుండియు అయిదువందలనదీనదములనుండియు బంగారు కలశములతో జలములు తీసుకొనిరాగా వశిష్టాదిమహర్షులు శ్రీరామునకు అభిషేకమును గావించి పట్టము గట్టిరి

శ్లో॥ తతస్సప్రయతో వృద్ధో వశిష్టో బ్రాహ్మణైస్సహ
రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్ ॥

శ్లో॥ వశిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః
కాత్యాయనస్సుయజ్ఞశ్చ గౌతమో విజయస్తథా ॥

శ్లో॥ అభ్యషించన్నర వ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా ॥

పూర్వము బ్రహ్మచే నిర్మింపబడిన కిరిటమును ధరింపచేసి రాముడు వానర, రాక్షసులను యథోచితముగా గౌరవించెను ప్రత్యేకముగా సీతమ్మ ద్వారా పౌరుష, విక్రమ బుద్ధులలో సాటిలేనివాడగు ఆంజనేయుని తెల్లని ముత్యాల హారముతో బహూకరించెను. భరతుని యువరాజుగా గావించెను ప్రజలను కన్నబడ్డలవలె చూచుచు పదునొకండు వేల సంవత్సరములు రాజ్యమును పాలించెను.

## శ్రీరామ రాజ్యము

శ్రీరాముడు రాజ్యమును పాలించుచుండగా వృక్షములు నిత్యపుష్ప ఫలములతో విరాజిల్లుచుండెను. రోగముల బాధగాని, బాల్యమరణములు గాని లేవు. సకాలములో వర్షములు కురిసి, భూమి యెల్లప్పుడును సస్యవతియై యుండెను. బ్రహ్మ, క్షత్రాది వర్ణములు లోభములను విడిచి తమ తమ నియమిత కర్మములను తప్పక ఆచరించుచుండెడివారు. ప్రజలందరును ధర్మమందే ఆసక్తి కలిగి "రామా! రామా!! రామా!!! అని వేనోళ్ల స్తుతించెడివారు కనుకనే నేటికిని "రామరాజ్యము" అని పేరుపొందెను. "రామో విగ్రహవాన్ ధర్మః" అనునట్లు "విగ్రహరూపమగు ధర్మమే రాముడు" అని ఖ్యాతివడసెను. నేటికిని చిన్నగ్రామముల యందు కూడ శ్రీరాముడు విగ్రహరూపమున వెలయింపబడి పూజింపబడుచు భక్తుల కోరికలను తీర్చుచున్నాడు.

ఓం తత్సత్

శ్రీరామాయ నమః

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు–

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం॥

శ్లో॥ శ్రీ రామచంద్రః శ్రితపారిజాతః
సమస్త కళ్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకః
నిరంతరం మంగళ మాతనోతు॥

